



Rs. 0—8—0.

గ్రంథకర్త:
వరఝ శ్రీకృష్ణమూర్తి

ఈనాటకమును అనువదించుటకుగాని, ఫిలుము తీయుటకుగాని, ప్రదర్శించుటకుగాని గ్రంథకర్త అనుమతి పొందవలెను. లేనిచో వారు గ్రంథకర్త తీసుకొనుచర్యకు బాధ్యులు—

వరఘ శ్రీకృష్ణమూర్తి



"I have always written for those, who are the Vanguard of the marching army, for those who are waging the great international battle, Victory in which should ensure the establishment of the Human Community without frontiers and without classes"

# తొలికుసుమము

" As the world does not stay in the same condition, it is better to have a good name, which endures as a memorial".

వధువు నతిమనోహరముగా నలంకరించినారు!!!

మరుసటిదినము … … వివాహమా?

ఔను! … … …

ఆమె మోము చంద్రుని ధిక్కరించినది!

ఆమె వాణి కోకిలను సిగ్గిలచేసినది!!

ఆమె అధరము చిలుకను బెదరించినది!!!

ఆమె కేశజాలము చీకటిని వెక్కిరించినది!!!!

ఆమె … … నవయవ్వన విలాసిని!!!!!

ఫాలతలమందలి ఆమెతిలకము … శివుని విభ్రాంతు నొనర్చినది!

శరీరమందలి ఆమెసౌష్టవము … రతికి మాత్సర్య మొదగూర్చినది!!

నేత్రద్వయమందలి ఆమెజ్ఞానరాశి … చూపరులను జోహా రొనర్పచేసినది!!!

చెక్కిళులయందలి ఆమెలేజవ్వనము … గులాబులను పరి హాసించినది!!!!

ఆమె......మధురస్వరూపిణి!!!!!

తేజోపూరితములైన ఆమెవాడిచూపులు, ప్రశంసనీయ
మైనవి!

కరుణారసాస్పదమైన ఆమెముఖమండలము, స్నేహాపరి
పూర్ణమైనది!!

ఆకర్ణాంతములైన ఆమెలోచనములు, ఆకర్షణీయమైనవి!!!
లేనగవుచే విస్ఫూర్జితమైన ఆమెయధరము, రమణీయ
మైనది!!!!

ఆమె......లలితమూర్తి!!!!!
ఆరామములే......ఆమె విహారస్థలములు!
పండితులే......ఆమె చుట్టపక్కములు!!
పుష్పాడియే......ఆమె పూలపాన్పు!!!
సారస్వతమే......ఆమె మారురూపు!!!!
ఆమె......కళామూర్తి!!!!!

ఎవ్వరు??

ఆ నవయవ్వన విలాసిని...ఆ మధురస్వరూపిణి...ఆలలిత
మూర్తి...ఆకళామూర్తి......

"ఆంధ్రసారస్వతము" గాక మరెవ్వరు!!!

ఆమె......పుష్పాలంకృత!!!

సుందరమై... సుకుమారమై ... పుష్పాలంకృతమైన
ఆమెతనూలత

మరింత ప్రకాశవంతమగునా?

ఎట్లు?... ...సుమవృష్టిచే!!!,

నాచే నర్పింపబడిన... ..."ఈకుసుమము"... ...

ఆసుమవృష్టిలో చేరదూ?

ఆమె తనూలత మరింత శోభాయమానముగా... ...

ప్రకాశింపదూ??... ...

పండితమన్యుల ప్రోత్సాహముఆసించు,

గ్రంథకర్త:

వఝ శ్రీ కృష్ణమూర్తి

నాట్యకళా కోవిదులు

## డాక్టరు సుబ్బారావుగారి ఆశీస్సు

ఈచిన్నవానిచే రచింపబడిన 'రషీదా' అను నాటకమును సమగ్రముగా చదివిచూచితిని. రచయిత కడు నేర్పుగలవాడనియు, Dramatic Technique గుర్తెరిగినవాడనియు, దేశకాలపరిస్థితుల త్రోవల నీదగలవాడనియు, ఔచిత్యసరసత్వరుచుల ననుభవనీయుడనియు గ్రహింపగలిగితిని. ఈతనికి మాఏడుకొండలవాడు చిరాయురారోగ్యములనిచ్చి మనుచు గాతయని దీవించుచున్నాను.

ఇట్లు,

గోవిందరాజుల వేంకటసుబ్బారావు,

4—2—1939

# ప్రవేశిక

ఆంధ్ర సారస్వతమునందు చరిత్రాత్మకములగు నవలలును, నాటకములును మిక్కిలి తక్కువగ నున్నవి. సారస్వతప్రపంచమున నపూర్వమగు ప్రబోధము గలిగి పెక్కుమంది యువకవులు నూతనగతులను దీర్చుచున్న ప్రకృతకాలమునందు గూడ జాతీయభావ ప్రచారమున కేమి, నాటకకళాప్రదర్శనమున కేమి, మానవస్వభావ పరిణామమును చిత్రించుట కేమి యనన్యలభ్యములగు కథావస్తువులు మన దేశచరిత్రమున ననేకములు దొరుకగలవు. ఈ నాటికి భారతదేశ చరిత్రమునందలి యొక ముఖ్యపట్టణమును పురస్కరించుకొని నిర్మింప బడినది.

విశ్వవిఖ్యాతుడగు అక్బరు సార్వభౌముని పరిపాలనాకాలము మన దేశచరిత్రమునందు మిక్కిలి ముఖ్యమైనది. నాటి ప్రపంచమున మతముపేరిట సాగింపబడుచుండిన దుండగములను, బోధింపబడుచుండిన సంకుచిత భావములను సహింపజాలక విశాలహృదయుడును, విశ్వమానవ కల్యాణకాంక్షియు నగు నాసార్వభౌముడు ముల్లాల నిరంకుశత్వము నరికట్టి, సులభసాధ్యమగు "దిన్ ఇ ఇలాహి" అను నొక యేకేశ్వరమతమును నిర్మించెను. ఈ మతసంస్కరణములు నాటి మహమ్మదీయ ప్రపంచము

నందొక గొప్ప సంచలనమును గలిగించెను. సనాతన పక్షమువారీ సంస్కరణకార్యమును గొప్ప మతద్రోహ ముగ బరిగణించి చక్రవర్తియెడ తీవ్రమగు వైమనస్యమును బూనిరి. అక్బరు రాజ్యకాలమున జరగిన మరియొక విస్మయకరమగు వృత్తాంత మాతని జ్యేష్టపుత్రుడును, యువరాజునగు సలీంయొక్క తిరుగుబాటు. ఈ రెండంశము లను గైకొని గ్రంథకర్త యీనాటికయొక్క యితివృత్తము నేర్పరచుకొనెను.

ఈనాటికలో ముర్టాజ్, రషీదాలు ముఖ్యపాత్రలు. ముర్టాజ్ విద్వాంసుడును, రాజభక్తియుతుడునయ్యు నద్వితీయమగు మతావేశము గలవాడు. ఇస్లాము మతరక్షణార్థమై యెంతటి త్యాగమునైన చేయదలచిన కార్యశూరుడు. అమాయకుడగు నితడు తనమిత్రుడగు 'రాజు' యొక్క కుత్సితవాక్యములచే వంచింపబడి, చక్రవర్తి మతద్రోహియని నిర్ణయించుకొని, ఇస్లాముమతస్థైర్యమునకై యతనిని బలివెట్టుట తన విధియనిదలచి రాజహత్య నొనర్ప యత్నించెను. ఇట్టి యుత్తమాదర్శము ననుసరించి ప్రవర్తించిన యితనికి విధివైగుధ్యమువలన నేకపుత్రికా శోకమును, సర్వనాశమును సమకూడెను. రషీదా ఆదర్శ యువతి. పితృక్షేమపరాయణ. దారుణమగు రాజహత్య నుండి తనతండ్రిని మరల్పజాలక తుదకాతని విషపూరిత

మగు ఖడ్గమునకు తా నాహుతియై చక్రవర్తి ప్రాణముల నీ వీరయువతి రక్షించెను. ఈ రెండుపాత్రలును గ్రంథకర్తచే చక్కగ పోషింపబడినవి. ఈ నాటికయందలి శైలియు మృదుమధురముగ నున్నది.

విద్యార్థిదశయందే చక్కని శిక్షణ నలవరచుకొని తన చారిత్రక జ్ఞానమును పరమోత్కృష్టమగు సారస్వత సేవకై వినియోగింప దొరకొనిన యీగ్రంథకర్త ప్రశంస నీయుడు. సదాదర్శములును, క్రమశిక్షణయు, చక్కని యుత్సాహమునుగల ఇట్టి యువకులే భావిభాగ్యవినేతలు.

పరమేశ్వరుడీ గ్రంథకర్తచే నితోధికముగ నుత్తమ శ్రేణికిజెందిన సారస్వతసేవను చేయించుగాక!

గుంటూరు,
**12—1—39.**

మారేమంద రామారావు

# CASTING : పాత్రలు

అగ్బరు:—చక్రవర్తి

అబ్దుల్ ఫజిలు
తోడరుమాలు } —చక్రవర్తి ప్రధానులు

షేకుఫజిలు:—అబ్దుల్ ఫజిలు తమ్ముడు; ఆస్థానపండితుడు

మానసింగు
అబ్దుల్ రహామను } —చక్రవర్తి సేనానాయకులు

సలీము:—యువరాజు

ముర్తాజు:—మతఛాందసుడు; దేశభక్తుడు

రాజు:—ముర్తాజు స్నేహితుడు

కుమారసేనుడు:—రషీదా ప్రణయాధిదేవత; రాజకుమారుడు

మహామ్మదుగవాను:—మహమ్మదీయ మతాచార్యుడు

రషీదా:—ముర్తాజుకుమారి, కుమారసేనుని నెచ్చెలి

యువకుడు:— మగవేషములో రషీదా

ఆస్థానోద్యోగులు—సేవకులు మొదలగువారు.

# రషీదా

## ప్రథమాంకము

### ప్రథమరంగము

ఢిల్లీలో ఉద్యానవనప్రాంతము

ప్రవేశము:— ముర్తాజా—రాజు

**ముర్తాజా:**—రాజా ! ఏదియో తీవ్రముగ నాలోచించు చున్నావు ! సభాభవనమునుండి వెలుఁవడగనే నన్నిట్లు రమ్మంటివే. కారణమేమై యుండును ?

**రాజు:**—కారణమా.......మరేమియును లేదు. ఓయీ ! అచ్చటికేగి కూర్చుని సావకాశముగ మాట్లాడు కొందము రమ్ము. ఆలోచింపవలసిన విషయ ములు పెక్కులుగలవు.

[ఒకప్రక్కగ కూర్చుందురు]

ముర్తాజ్ ! నేడు సభాభవనమున నడచిన వృత్తాం తమునుగూర్చి నీయభిప్రాయ మేమి ? ఏదియో కొంత పలుకుబడిగల నీకే యిట్టి యవమానము సంఘటిల్లినదే! ఇక నాబోటివారిసంగతి యేమి కావలెను !!

ముర్టాజు:—కాదు! రాజా—కాదు! నీవు పొరబడుచున్నావు. అది నా పూర్వకర్మఫలితము. కేవలమును నా ప్రారబ్ధముతప్ప మరియొకటిన్నియు నా యీ యవమానమునకు కారణము కాజాలదని నా యూహ. సార్వభౌము డిట్లు స్వామిసేవాతత్పరుల నవమానించునని కలయందైనను నేతలంపలేదు. అయినను నేటి నా యవమానము తలవనితలంపుగా సంభవించినది. మరి దీనికి కారణము నా ప్రారబ్ధమే కావలెను గదా!

[తలవంచుకొని ఆలోచించుచుండును.]

రాజు:—[తనలో] ముర్టాజు మనోవృత్తి యిట్లు వేదాంత మార్గము ననుసరించుచున్నదే!.......కానిమ్ము. ఇతని కెట్లైనను అగ్బరుమీద ద్వేషమును కలుగజేసి తీరవలెను. అప్పుడుగాని నా కోరిక నెరవేరదు.

[ప్రకాశముగా] కాదు! ముర్టాజ్! కాదు. నీవు పొరబడుచున్నావు. అనవసరముగా నిన్ను నీవు ద్వేషించుకొనుచున్నావు. నీ యీ అవమానమునకు కారణము నీ ప్రారబ్ధమా? ఎంత హేయమైన తర్కమోయి నీది!.........ముర్టాజ్! నీయందు నీ పూర్వీకుల శౌర్యాగ్ని చల్లారి పోయినదా!

పవిత్రఇస్లాము మతస్థుడవైన నీవు ఇట్టి యవమాన మును సహింతువా? సార్వభౌముడు దేవుడు కాడు కదా!! నీవు చక్రవర్తియెడ నెంతటి స్వామి భక్తిని, యెంతటిప్రేమను చూపెదవో......... నీయెడ నతనుగూడ నంతటిప్రేమను, అట్టి వాత్స ల్యమును, కనపరుపవలదా? ముర్తాజ్!!! అట్లు కాక సోదరమతస్థుల యెదుట!......... నిండు సభలో!!...... సార్వభౌముడిట్లు నిన్నవమాన పరచెను గదా!! ఇంకను నీకు స్వామిభక్తియా? ఇట్టి రాజసేవయా?? ఎంత యవమానము!.... ఎంత యసహ్యము!! ముర్తాజ్! లెమ్ము. నీ యవ మానమునకు దగిన ప్రతీకారము చేయుము!.... నీ యశస్సును కాపాడుకొనుము!! మరిచూ డుము...... పవిత్రమైన ఇస్లాము మతమును అక్బరు నేడెట్లు న్యూనత పరచుచున్నాడో. ఈ నీచుడు నిన్నువలెనే ఇస్లాము మతస్థులను హింసించుచుండ నీవూరక చూచుచుందువా! పూజ్యుడైన ప్రవక్త మహమ్మదు పవిత్రాదేశ ములు నీ చెవులలో మారుమ్రోగుట లేదా? నీవు సున్నిష్ఠుడవగు మహమ్మదీయుడవు కావా?? ముర్తాజ్! ఇకనైన తెలివి తెచ్చుకొనుము. నీకర్త

వ్యమును గుర్తింపుము. ప్రవక్తపేరు స్మరించు కొని...... ఇస్లాము మతధర్మమును తలంచు కొని... అధఃపతితమైయున్న మనమతము నుద్ధరింప కృతనిశ్చయుడవుకమ్ము. అగ్బరువంటి మత కంటకముల నూడబెరికి ఇస్లాము విజృంభణామార్గమును నిష్కంటక మొనర్పుము. ముర్తాజ్! ఇస్లాముమత పరమద్రోహివైై...... నీ యవమానమునకు ముఖ్యకారణమైన యీ నీచునకు దగిన ప్రతీకార మొనర్చుట నీ ధర్మము కాదా? అగును. ఈనా ఆదేశము పూజ్యుడగు మన ప్రవక్తదని గ్రహింపుము. ఏమి! ముర్తాజ్! ఏమందువు?

ముర్తాజు:— [ఒక్కసారి పెద్దనిట్టూర్పు విడిచి, మెల్లగా] రాజా! నీ తర్కము ప్రశంసనీయమైనదే!! కాని నా యవమానము నా పూర్వకర్మఫలితము కాదనుటను మాత్రము నేను విశ్వసింపజాలను. అయినను నీవు చెప్పినట్లు ఇస్లాము మతమునకే జరుగుచున్న మహావమానముముందు నాకు జరిగిన యీ అవమానము లెక్కలోనిది కాదు!!! ఇస్లాము మతరక్షణము నేడు నా ప్రథమకర్తవ్యము. ఇస్లాముమతమునకు ......అవమానమా? దుస్సహము. ఇస్లాము

మతద్రోహియే యగుచో... ... అక్బరు శీఘ్ర
లోనే తగిన ప్రతీకారము ననుభవింపగలడు.

రాజు:—[తనలో, సంతోషముతో] సెబాస్! పాచిక బహు
బాగుగ పారినది. ఇక త్వరలోనే ఇతనిని కార్యో
న్ముఖు నొనర్చెదగాక !

[ప్రకాశముగా] ముర్టాజ్! ఇప్పటికైనను అక్బరు
మతద్రోహియని గ్రహింపగల్గితివి. ఓయీ! మత
ద్రోహికి శిక్ష మరణమునకంటె మరేమికలదు ?

ముర్టాజు:—రాజా! నీయూహ సరియైనదే. కాని యిట్టి
మహదాశయములను నెరవేర్చుకొనుపట్ల మనము
తగిన సమయముకొఱకు వేచియుండవలెను.
రాజా! సార్వభౌముడు నాకొనర్చిన యవమానము
దుస్సహము కదా ! !

రాజు:—ఔను, ముర్టాజ్! ఔను. నాకు తెలియును. నీకు
జరుగవలసినదేనా యిట్టి యవమానము! నీబోటి
స్వామి భక్తుని.... రాజసేవాతత్పరుని.....సార్వ
భౌము డిటులా...? సత్కరించుట!! చక్రవర్తి
యట!!...చక్రవర్తి!!!!...బుద్ధిశూన్యుడై...
యుక్తాయుక్త వివేకము లేక... జ్ఞానరహితుడై...
ఒక విశ్వసనీయుని! పవిత్రమహమ్మదీయుని!!

అకారణముగా పరిభవించిన యీ తుచ్ఛుడు
చక్రవర్తియట!...చక్రవర్తి!! నీచాగ్రేసర చక్ర
వర్తి!!! ద్రోహి!...పాపి!!!...కిరాతుడు!!!!
ఇస్లాముమతమునకు పెద్దకళంకము!!!!! ముర్తాజు
పవిత్ర మహమ్మదీయుడే అయినను?......ఇట్టి
యవమానమును భరించునో!!!...తగిన ప్రతీకార
మొనర్చి ఖ్యాతిగాంచునో!!! ...మతద్రోహుల
యెడ మహమ్మదను శిష్యు లేవిధముగ వర్తింప
వలెనో?? ఏమి చెప్పునో!!!...ముర్తాజు...మరి!

ముర్తాజు:—రాజా! చూడుము. అక్బరుసార్వభౌము డతి
శాంతియుతుడని ప్రతీతి. కాని నేడాశాంతి యే
యేటబడినదో!...... నన్నవమానించినాడు!!
మిత్రమా! ఇది న్యాయమా! తగుపాటి శ్రీమంతు
డను గాని నిర్భాగ్యుడను కానే!!......రాజసేవా
తత్పరుడనే!!!...అప్రతిమానపౌరుషశాలినే!!!!...
గౌరవనీయు మహమ్మదీయుడనే!!!!! ... అట్టి
నన్నా? అవమానపరచుట!! అబ్బ! నాహృద
యము దహించుకొనిపోవుచున్నది! నా సర్వ
శక్తులూ ... ప్రతీకారమును! ...మరణదండన
రూపమైన ప్రతీకారమును!!......కాంక్షించు

చున్నవి !! మతద్రోహి మరణశిక్షకై త్వరపడు
చున్నవి !!!

**రాజు:**—అగును ! మురాజ్ ! నీ నవనీతహృదయ మెట్లు బాధపడుచున్నదో నాకు తెలియును. నిశ్చలమై... నిర్మలమైన నీ మనోహ్రాదమున ప్రచండ ప్రతీకార తరంగములెట్లు భీభత్సముగా గొట్టుచున్నవో నాకు తెలియును. సభా భవనమున నీకు జరిగిన యవమానము నా హృదయమును సహితము కలచివేయుచున్నది. చూడు ! మురాజ్ !! నీబోటి స్వామిసేవాతత్పరునకు......ధనశాలికినే యిట్టి యవమానము సంఘటిల్లినచో మాబోటి సాధారణమానవుల కింక నెట్టి కష్టములు వాటిల్లునో గదా !

**మురాజు:**— [నిస్పృహతో] కాని...రాజా ! అతడు !!... చక్రవర్తి !!! ప్రబల పరివార సహితుడు !!! సకల సంపత్సమేతుడు !!! మరి నేనో?...ఏకాకిని !... నిస్సహాయుడను !! అట్టివానితో నాయట్టివాడు డీకొనుటయా !!! యావద్భారతదేశ విశ్రాంత ప్రతాపుడు ...హిందూ మహమ్మదీయ మత సమ్మేళన దీక్షాపరతుడు... సర్వ స్వతంత్రుడు... అయిన అక్బరు సార్వభౌమునితో పంతమా ?

ప్రతిజ్ఞయా ?? ప్రతీకారవాంఛయా ??? ఇది సంభవమగునా? రాజా! ఇది కేవలమును "అందని మానున కెగబ్రాకుట" కాదా !!!

[కొంచెమాగి] ఏమోయీ! ఏమది తీవ్రముగా నాలోచించుచున్నావు ?

రాజు:—[లేచి కొంచెము ముందునకువచ్చి నిలచి, తనలో] హా! ఇప్పటికిని నే సీతనిని నా వశముగావించుకొనలేక పోతినే! సభాభవనమున జరిగిన యవమానము మూలమున సీతని కుద్రేకమునుగల్పింప యత్నించి విఫలమనోరథుడనైతిని... ...పాపము! దుర్భరా వమాన దందహ్యమానమానసుండయ్యా సీతడు బలపరాక్రమ సంపన్నుడగు అగ్బరుతో కయ్యమునకు కాలుదువ్వ వెరచినాడు!... వెరచి, తానే యూరడిల్లినాడు!!....ఊరడిల్లి, అవమానమును మరచినాడు. హా! దైవమా!! వేరుమార్గము లేదా ? నా ముఖ్యాభీష్టము నెరవేరదా ?

అగ్బరుకు తోడునీడయై, సువిశాల మొగలు సామ్రాజ్యమునకు ప్రథానియై, నా యశస్సంపదల కడ్డంకియై, అడుగడుగునకును నా యభ్యుదయమున కంతరాయములను గల్పించుచున్న యీ అబ్దుల్ ఫజిలును మట్టుబెట్టింప నిశ్చయించి వచ్చిన

నా ప్రయత్నము విఫలమగునా యేమి?? కానిమ్ము. మరియొకసారి ప్రయత్నించి చూచెదను.

[ప్రకాశముగా] ముర్తాజ్! నీవు చాల పొరబడు చుంటివి. నీ బుద్ధి పెడదారి త్రొక్కుచున్నది. భగవద్విషయకమగు పవిత్ర ఇస్లాముమత సేవలో ఈ కొద్దిగొప్పలకును, బలాబలములకును తా వుండునా ?? సార్వభౌముడైననేమి ? ఆ పాపి ఇస్లాముమతద్రోహి కాడా? ఆ పాపిశరీరము సార్వ భౌమునిదే కావచ్చును; కాని ఆత్మ కట్టివి శేషము లేదుకదా!! నిస్సహాయుడ వయినంతమాత్రమున నీవు పూజ్యమైన ఖురానుకు వ్యతిరిక్తముగా నడుచు కొంటివా? నీది పరిశుద్ధాత్మకదా! అప్పు డతడు నీకంటె నధికుడెట్లగును?......నీ ఆత్మకువలెనే తృణీకృతమగు ఇస్లాము మతముకొఱకై యీ ద్రోహిని శిక్షించుట న్యాయముకాదూ ? అది ప్రశంసనీయమైన భగవత్కార్యమే అగునుకదా! ఈ సందర్భమున దైవబలము పూర్తిగ నీపక్షమున నున్నది. ఇక నీ కేమిలోటు? భగవత్ప్రేరితమైన యీకార్యమును నీవు నెరవేర్పనిచో నీవు ఇస్లాము మతద్రోహివని లోకము కోడియై కూయగలదు. భగవత్ దృష్టిలో తృణీకరింపబడ్డ నీవు, మానవ

దృష్టిలో సౌభాగ్యసౌధముల నిర్మింపజాలవు!!! ముర్తాజ్! ఉచితమై, పవిత్రమై, శ్లాఘ్యమైన యీ కార్యమును నెరవేర్చి చిరస్థాయియగు యశస్సును సంపాదింపుము.

**ముర్తాజు:**— [గాఢముగా నిట్టూర్చి, మెల్లగా] రాజా! తిరిగి నా హృదయమున శౌర్యాగ్నిని రగిల్చితివి. ఈ శౌర్యాగ్నికి తోడు అవమానాగ్నియు నన్ను పీడించుచున్నది. ఈ అగ్నిద్వయమునకు ఇస్లాము మతరక్షణోద్దేశము సమిధయైనది. రాజా! మరి యీ యగ్ని చల్లారదు!!!

[లేచి నిలచి కొంచెము బిగ్గరగా] ఏ పవిత్రోద్దేశముతో ఇస్లాముమత రక్షణదీక్షాబద్ధుడ నైతినో, ఆయుద్దేశము నెరవేరు వరకును నేను నిద్రింపను. రాజా! నేటినుండి నిశ్చల దృష్టితో నన్ను పరికించు చుండుము......

[విచారముతో, మెల్లగ] నా హృదయము పరి పరి విధముల బోవుచున్నది. సభాభవనమును వీడి చాలసేపయినది. కుమారి రషీదా నాకై యెదురు చూచుచుండును. పోయివచ్చెదను. రాజా! కార్యభారమును వహించితిని. ఇక నీవు

శాంతచిత్తుడవుకమ్ము... ...పోయివచ్చెదను...
సెలవు.

[ముర్టాజు వెడలిపోవుచు. అతనిని సాగనంపివచ్చి]

రాజు:— [ఇటునటు తిరుగుచు] ముర్టాజ్! నీ హృదయ మెంత పవిత్రమైనదోయీ! నీవు ప్రేమానంద మయుడవు. ఆ మూర్ఖుల రక్షింపను తగిన తండ్రి వోయీ! ఆహా! నీ స్వామిభక్తి యద్భుతము గదా!! ఇస్లాము మతమందలి నీ భక్తికిని...నీ స్వామిభక్తికిని వందనములు. అక్బరు ఇస్లాము మతద్రోహి యనినపుడెట్టుల కంపించితివి! అతని బలపరాక్రమాదులకు భయపడియు మతరక్షణో ద్యమమునకై నీప్రాణముల నైతము గోల్పోవ నిశ్చయించితివి గదా! ధన్యుడవు!......
ఇస్లాముమతరక్షణదీక్షాపరుడవు!! ......నీకు శ్రేయమగుగాక!

అబ్దుల్ ఫజల్! ఇక నీలోకముతో నీకెంతయో కాలము పనిలేదు. నీ ఆయుర్దాయము పూర్తిగా వచ్చినది. నేటితో నా చిరకాలవిరోధి...ప్రబల ప్రత్యర్థి......సమసిపోవును. ఇక నా యశశ్శ్రీలీ భూలోకమున చిరస్థాయిగావా? [సంతోషముతో] రాజా! నీయదృష్టరేఖ బయల్వెడినది. ముర్టాజు

మనస్సు మరి మారరాదు. నేటిరాత్రియే, సగ్బరుపై మండిపడుచున్న మతాధికారి నొకనిని ముర్తాజుగృహమున కంపెదను. మతవిరోధియని అగ్బరుపై మండిపడుచున్న ఈ మతాధికారి ముర్తాజును తగురీతిని మార్గమునకు దెచ్చును. పరిస్థితులప్పుడు చక్కబడును.

[ఆలోచించుచు వెడలిపోవును.]

# ప్రథమాంకము

## ద్వితీయరంగము

**ముర్తాజుగృహము.**

[ప్రవేశము : ముర్తాజు]

[ఆలోచించుచు నిటునటు పచారు చేయుచుండును]

నా హృదయమున నేడెద్దియో అద్భుతకలవరము కల్గినది. రాజా! నిజముగ నీవు చెప్పిన యాలోచనమంగీకారమేనా? అక్కటా! స్వామి భక్తుడని పేరుగాంచిన నేను నా స్వామి అగ్బరు సార్వభౌమునిపై కత్తిగట్టుటయా! ఎంత యవివేకము!...ఛీ...నా మనము పెడదారిని ద్రొక్కు

చున్నది. సార్వభౌముడును, నా స్వామియునై నంతమాత్రమున నీ ఇస్లాముమతద్రోహిని విడిచి పుచ్చుటయా? కాదు...... ఇస్లాముమతరక్షణ దీక్షాబద్ధకంకణహస్తుడనైన నేను, నా తండ్రి నైనను......నా భార్యనైనను......నా బంధువులనైనను...తుదకు నా ముద్దుల రషీదానైనను విడిచిపుచ్చరాదు. ఈ పవిత్రకార్యములో పూజ్యుడగు మహమ్మదునసహాయము తప్పక నాకు లభించును. అట్లు లభించనిచో నా ప్రాణముల త్యజించుటకైనను వెనుదీయను!!!!

[ఒకచోనాగి] ముర్టాజ్! నీ వింతవరకును ప్రతిజ్ఞాభంగకారివికా లేదు. ఇకముందుకాబోవు........ మతద్రోహికి మరణదండన సముచితము. ఆశిక్షను నేను విధించి తీరెదను. ఇది ముమ్మాటికిని నిశ్చయము!!! ఆ నాడే...ఆ పవిత్రకృత్యము నెరవేరిననాడే, దుర్భరావమాన మానసుండనైన నాకును...నీచతిరస్కారవ్యాకులమైన ఇస్లాము మతమునకును శాంతిచేకూరును.

[తలుపుమోగినట్లు ధ్వని వినపడును]

ముర్టాజు: [ఉలికిపడి] రషీదా! రషీదా!!

[ప్రవేశము: రషీదా]

బాబా! ఏమది.

ముర్తాజు:—కుమారీ! చూడుము. ఎవరో పిలచుచున్నారు.

[రషీదా పోవును]

[ముర్తాజు గాఢాలోచనామనస్కుడై యుండును]

[ప్రవేశము : రషీదా, మహమ్మదుగవానులో]

రషీదా:—బాబా! మనగృహము పావనమైనది. సుప్రసిద్ధ మహమ్మదీయాచార్యులు మహమ్మదు గవాను ప్రముఖులు మనగృహమునకు విచ్చేసియున్నారు.

ముర్తాజు:—[చూచి, ఆశ్చర్యముతో లేచి] మహాశయా! ఇవే నా వందనములు. ఈ యాసనము నలంకరింపుడు.

[గవాను కూర్చుండును.]

మ. గవాను:—ముర్తాజ్! నీప్రేమకు సంతసించితిని. నీ భక్తి తాత్పర్యములకు మెచ్చితిని. కూర్చుండుము.

[ముర్తాజు కూర్చుండును.]

ముర్తాజు:—మహాశయా! తమ ఆగమన కారణమేమి?

గవాను:—ముర్తాజ్! నేడు నీతో అతి ముఖ్యమైన విషయము నొకదానిని ముచ్చటింప వచ్చితిని.

ముర్తాజు:—[ఆశ్చర్యముతో] నాతోనా!! సెలవిండు. నే నెల్లప్పుడును తమకు వశంవదుడనే గదా!

గవాను:—ముర్టాజ్! సార్వభౌముడు నిన్ను పరాభవించిన మాట వాస్తవమా ?

ముర్టాజా:—ఔను. సార్వభౌముడు స్వామిభక్తులను వంచించుటలో నేర్పరియని యీవర కెరుగను.

గవాను:—ముర్టాజ్! సార్వభౌముడు స్వామిభక్తులను వంచించుటయే కాదు. పవిత్రమైన ఇస్లాము మతమునే పరాభవించినాడు. ఆ విషయమై నే నెంతయు వగచుచుంటిని. నే నొక్కడనే కాదు! సమస్త ఇస్లామునూ!!! విచారసముద్రమున మునిగియున్న మమ్ము దరిజేర్చుటకో యన దైవము నిన్ను మాయొద్దకు బంపినాడు. తోడిసోదరుల కష్టనిష్ఠూర్యములకు వగచి వారి నుద్ధరింతువో!... లేక మతభ్రష్టుడైన సార్వభౌమున కంతేవాసి వగుదువో!!...... తెలిసికొనగోరియే వచ్చితిని. ఇదియే నా వచ్చిన కర్తవ్యము. ఇక నీ నిశ్చయ మెద్దియో చెల్పుము.

ముర్టాజా:—ఆర్యా! మీ వచనములెంతయు ప్రశంసనీయములై యున్నవి. ఈ ముర్టాజ్ తమమాటల కెదురాడనోర్వడు. ఇస్లాము ప్రపంచమంతయు నాపై తమ యాసల నిడికొనుట నా యదృష్టమే.

[కోద్దిరోషముతో] సమస్త ప్రపంచమంతయు కత్తి గట్టినిలిచినను నా యభీష్టమీడేర్చుకొని తీరె దను!!!

ఇవాను:—సెబాస్! ముర్టాజ్!! నీ పల్కులకానందించితిని. ఇస్లాము మతమందలి నీ భక్తితాత్పర్యములు మిక్కిలి ప్రశంశనీయములు. సార్వభౌముని దౌష్ట్య మెంతయు దుర్భరముగనున్నది. సుప్రసిద్ధమొగలాయీవంశ సంభూతుడై......పవిత్ర ఇస్లాము మతస్థుడయ్యూ హిందూకన్యల వివాహమాడినాడు!!! తాను వివాహమాడుటయేగాక సలీమునకు రాజకన్య నుద్వాహమొనర్చినాడు!!!! తనకుమార్తె నొక హిందువునకొసగినాడు!!!! ఈ విషయములను నీవు గమనింప లేదా? ముర్టాజ్! వీటికన్నిటికిని నేను సహించితిని......కాని దీనికి మాత్రము సహింపలేను. నిండుదర్బారులో మతాంతరుల యెదుట నితడిస్లాముమతమును ఖండించుచున్నాడు!! తానొక క్రొత్తమతమును స్థాపించినాడు!!!! హిందూమహమ్మదీయ సమ్మేళనకై పాటుబడుచున్నాడు!!!!! చూచితివా! ముర్టాజ్! వీటిని నీవు సహింతువా? నీ మతము

రూపుమాయుచుండ నీ వూరక చూచి యూరకుం దింపగలవా ?

ముర్తాజు:—ఆర్యా ! తమకు నాచిత్తవృత్తి బాగుగ తెలియ లేదు...... నాపై నాగ్రహింపకుడు......దాని కేట్టి నిదర్శనముగావలెనో సెలవింము. చూపెద గాక !

గజాను:—[తనలో] ఇప్పటికి నా యభీష్ట మీడేరినది. రాజుకోరిక నెరవేరినది. నేటికిస్లాము మతద్రోహి యగు నగ్బరునకు తగు ప్రాయశ్చిత్తము జరుగు కాలము సమీపించినది.

[పరిహాసముగా] ముర్తాజ్ ! నీకు కృతజ్ఞుడను. నీవు ఇస్లాము మతద్రోహివని పలుక సాహసింతునా ! ! నీ బోటి పూజ్యుల నిందించి ఘోరనరకములపాలు గానుంకింతునా !!! ముర్తాజ్ ! శాంతింపుము. పవిత్రమైన నీ వాగ్దానమును నెరవేర్చి, ఇస్లాము మతమునకు సేవచేసి' ధన్యుడవుగమ్ము. పోయి వచ్చెదను.

[ఇరువురును లేతురు — గజాను వెడలిపోవును]

ముర్తాజు:—[ఇటునటు పచారుచేయుచు] నా సందేహము తొలగి పోయినది. అగ్బరు ద్రోహియని తేలినది. రాజు

హిందువుడని యతనిమాటలను శంకించితిని. మహాత్ముసుగవాను రాకతో నా సంకల్పము దృఢమైనది. మతద్రోహిని బరిమార్చియే తీర దను!!

[రషీదా : తిరిగి ప్రవేశము]

[తనలో] తండ్రి కోపముగనున్నాడు. కారణము సభాభవనమునందలి వృత్తాంతమైయుండునా??

[మెల్లగా] బాబా !

ముర్తాజా:—[చికాకుతో] ఎవరువారు ? రషీదా......ఊర కుండుము.

రషీదా:—[తనలో] ఏమిబాబా ఇది ! కారణము లేకనే యింతటి చికాకు.

[ప్రకాశముగా] బాబా!

ముర్తాజా—[కొద్దికోపముతో] రషీదా ! నీకిది సమయము కాదు. వెడలిపొమ్ము.

రషీదా:—ప్రబలమగు కారణములేనిదే తండ్రి కింతటి కోపమురాదు. అయినను ఈసారి చూచెదను.

[ప్రకాశముగా] బాబా! సార్వభౌము డేమైనను ప్రాతికూల్యతనుచూపెనా? లేక అవమానించెనా??

ముర్తాజు:—ఛీ. వాడిపేరు నుచ్చరింపకుము. పవిత్ర ఇస్లాము మతద్రోహి !!! ...... ఘోరమరణదండన కర్హుడైనపాపి !!!!

రషీదా:—[చకితయై] బాబా ! ఏమది ! సార్వభౌముడు... ఇస్లాముమతద్రోహియా ? ఏమి యీ వైపరీత్యము......అతడు ప్రశాంతహృదయుడు!...... కరుణాసముద్రుడు ! ! ! బాబా ! అక్బరు సార్వభౌముడు ఇస్లాముమతస్తంభమణి. అల్లాయొక్క అపరావతారము. అట్టి చక్రవర్తి పాపియా ? ఆ మహనీయుడు ద్రోహియా ? కాజాలదు. కాజాలదు. ఇదియసత్యము. ఈ ఊహయే సర్వనాశనకరము ! !....అమంగళకరము! ! !... ... దారుణము ! ! ! !

ముర్తాజు:—[కోపముతో] ఆ ! ఏమి ! నాకు నీతులు గరపుచుంటివా ? ఎంతటిసాహసము ! తండ్రితోడనా ? ... ఈ సరసములు. రేపీసరికి ఆ పాపి శిరము భూపతితము కావలసినదే !!! తెలియునా ?

రషీదా:—[దుఃఖముతో తనలో] హా ! దుర్భరము......దుర్భరము. మహనీయుడగు అక్బరుసార్వభౌమునకు మరణదండనయా!!!...దైవమా ! దీనికి తిరుగు లేదా ?

[పరిహాసముగా] బాబా! వలదు. అంతటి భయం కరకార్యమును తలపెట్టకుము. చక్రవర్తిప్రాణాపహరణోద్యమము సామాన్యకృత్యమా? దాని వలనకలుగుచెడుగుల నూహింపవేమి?? హత్యానేరమునకై పట్టుబడినచో నా తండ్రిగతియేమి గాను!!!!...

ముర్తాజు:—[చిరునవ్వు తెచ్చుకుని] అమాయకురాలా! నా క్షేమమును గూర్చియా?... నీ హృదయాందోళన!! క్షణభంగురముకదా మానవజీవితము. పవిత్రమైన ఈ కార్యములో ప్రాణముల కోల్పోవుటకైనను నేను సంసిద్ధుడనే!!

రషీదా:—బాబా! ఎంతటివెఱ్ఱి! ఎన్నిచెప్పినను నీపట్టును వదలవుకదా!! చక్రవర్తి ప్రాణాపహరణోద్యమము పవిత్రకార్యమా?
[చెవులుమూసికొని] పాపము శాంతించుగాక! నీవు నాకొక్కతెకే తండ్రివి. కాని చక్రవర్తి అసంఖ్యాకైక ప్రజలకు తండ్రి! ప్రాణదాత!! లోకనేత!!! బాబా! నాకోరికనుచెల్లింపుము. నీవు లోకైకనింద్యమును, పిశాచప్రియమునైన కార్యమును నెరవేర్పబూనితివి. వలదు! బాబా! వలదు!! భక్తిపూరిత హృదయముతో సుల్తా

నును సేవింపుము! ... దేశమును సేవింపుము!! కృతకృత్యుడవయ్యెదవు!!!! ...

ముర్తాజా:—[అమితకోపముతో, బిగ్గరగా] ఛీ పాపినీ! నీ మొగము చూడరాదు. పొమ్మావలకు. పిశాచసమురాలవైన నీకు జనానాయే బందికానా. పొమ్ము. వెడలిపొమ్ము.

రషీదా:—[కన్నుల బొటబొట నీరుగార మోకాళ్లపైకూర్చుని చేతులు జోడించి]

బాబా! శాంతింపుము. దయావిహీనుడవు గాకుము. నీముద్దులకుమార్తె రషీదాపై ప్రేమ నొకసారి స్మృతికి తెచ్చుకొనుము. ... మరల నొక్కసారి నానిస్సహాయ ...నిర్భాగ్యజీవనమును జ్ఞప్తికి దెచ్చుకొనుము. చక్రవర్తి ప్రాణాపహరణోద్యమమునుండి విరమింపుము. అమంగళకరమై... అశుభశూచకమైన ఇట్టి దుష్కార్యమునకు తలబడబోకుము. ఇకనైన నీయుద్యమమునుండి తొలగుము. చక్రవర్తిని యథాపూర్వముగ భక్తితో సేవింపుము.

[ఆమె అతనిపాదములపై బడును]

ముర్తాజా:—[అసహ్యముతో] ఛీ దుర్మార్గురాలా! నీశరీరస్పర్శచే నాశరీరము పాపపంకిలము కానున్నది. అవివేకీ!

తండ్రి యవమానమునకు కారకుడు ! ... తార తమ్యాము లెరుగని మూర్ఖుడు!! ...పవిత్ర ఇస్లాము మత ద్రోహి ! ! ! ... అట్టి అగ్బరు ప్రాణాప హారణము అపవిత్రమనియా నీయాదేశము ! ! ! పితృకార్యమున కడ్డుతగిలిన పాపికింతకంటెను బహుమానమింకేమి కావలయును ? ? ?

[రషీదాను తన్ని నిర్లక్ష్యముగా పోవును]

# ప్రథమాంకము

## తృతీయరంగము

చక్రవర్తి అంతఃపురము.

[ప్రవేశము : అక్బరు]

[ఇటునటు పచారుచేయుచు]

ఎంతపని జరిగినది. అయ్యో! ఎంతటి తెలివి తక్కువ పని చేసితిని. ఆదృశ్యమింకను నా కన్నుల కగపడుచున్నది. దానివలన కలుగు చెడుగుల నూహింపనైతిని. అద్వితీయుడగు యోధుడు! ... సచ్చరిత్రుడు ! ! ... స్వామికార్యనిరతుడు ! ! ! ...

అట్టి ముఠ్ఠాజు నవమానించితిని. ఎంతటివివేకశూన్యత !! దేశమందంతటను తిరుగుబాటులు చెలరేగినవి. దినదినమునను గండములు ప్రాప్తించుచున్నవి. సచ్చరిత్రుడనియు, స్వామి ఔన్నత్యము నభిలషించు ఘనుడనియు, కదా బైరాంఖానుని నాయండ జేర్చితిని. ఈ బైరాంఖాను నేడు నాకు ప్రతికక్షియైనాడు !!! నాపైననే కత్తిదూయ సాహసించినాడు !!!! తుదకు బంధువులును, స్నేహితులునుగూడ నాకు ప్రతికూలురైరి. ఇట్టి పరిస్థితులలో నొక స్వామిభక్తు నవమానించి నా భవిష్యత్తును క్లిష్టతరము నొనర్చుకొంటిని. ఆహా! జ్ఞానశూన్యుడనై వర్తించితిని గదా !

ప్రవేశము : అబ్దుల్ ఫజలు

పాదుషావారేదియో గాఢముగ యోచించుచున్నారు !

అక్బరు:— [తలపైకెత్తి] మిత్రమా ! సమయమున కేతెంచితివి. కూర్చొనుము.

అబ్దుల్ ఫజలు:— తాము చింతాక్రాంతులై యున్నారే !

అక్బరు:— స్నేహితుడా ! ప్రారంభమున వివేకహీనుడనై ప్రవర్తించితిని. తుదకు పశ్చాత్తాపతప్తుడ నగు

చుంటిని. స్వామిసేవాతత్పరుడగు ముర్తాజును నిండు సభాభవనమున నవమానించితిని. దానికాతని డెందమెంత డిల్లవోయెనో యని విచారించు చుంటిని. క్షణమైన నన్ను వీడక కనిపెట్టుకొని యుండు కరుణామయుని, హృదయవిదారకములగు పల్కులచే నొప్పించితిని. అట్టి యాతడు మరి నాకు విరోధికాడా? అతని హృదయము ప్రతీకారవాంఛకై పరువులెత్తుచుండదా??

ఫజిలు:—ఆ! ఏమంటిరి......సకలసామంతరాజ పరివృతులై, ఆ సేతుహిమాచల భారతభూమికి సార్వభౌములై, హిందూ మహమ్మదీయమత సమ్మేళన దీక్షాపరతంత్రులైన......మీరు! ఒక సామాన్యమహమ్మదీయునకా, భయపడవలసినది? కాలమహాత్మ్యము! ... కేవలము భ్రమ!! ...

అక్బరు:—లేదు. కాలమహాత్మ్య మెప్పటికినిగాదు. అనవసరముగ ...అక్రమముగ ... అనాలోచితముగ ... ఒక స్వామిహితైకజీవి నవమానించితిని. నేనే పాపిని. పవిత్ర ఇస్లాముమతస్థుడైన ముర్తాజు నవమానపరచితిని. దానికి ప్రతిఫలము ననుభవింపక తప్పదు!!!

ఫజిలు:—ప్రభూ! మీరేల వ్యర్థముగ చింతించెదరు. గతించిన దానికి వగచి ఫలితమేమి?

అక్బరు:—దుఃఖమా! ఇది నాకుచిరపరిచితమే. నా మనస్సానందము నెన్నడో యెడబాసినది! నా జవ్వనము సమసిపోయినది!! నా హృదయము భగ్నభగ్నమంచుచున్నది.!!! నాకిక విచారమేల కలుగును??? నా జీవితమే దుఃఖమయము. నా జ్యేష్ఠపుత్రుడును, సింహాసనార్హుడును, భావి మొగలాయీ సార్వభౌముడును అగు సలీమా? నిర్దయుడు! .....నిరక్షరకుక్షి!!...... నిర్భాగ్య జీవి!!!....త్రాగుబోతు!!!! ....కన్నతండ్రి మాటల బాటింపని కఠినహృదయుడు!!!!..... సంఘనియమముల నుల్లంఘించు స్వేచ్ఛా విహారి!!!!!! అట్టి సలీము...అగ్బరు మరణానంతరము సింహాసనము నధిష్టించును!

రెండవకుమారుడు, మురాదా? త్రాగుబోతు!...మతిహీనుడు!!...ధన్యాలును గూర్చి మరేమి చెప్పవలెను?...పైవారికి దీసిపోవని దిట్ట!!!!...

ఫళిలు:—ప్రభూ! మీరొక నిర్భాగ్యునిగూర్చి విచారించుచున్నారు. ముట్టాజు కేవలము స్వామిభక్తుడే! రాజహితాభిలాషియే!! కాని ప్రభూ! నిజమైనస్వామి సేవకులు తమప్రభువుపై నెన్నడును

అకారణముగ కోపగించరు. ప్రతిక్రియకై తహ తహలాడరు ! ! ! ప్రభువు వివేకహీనుడై ప్రవర్తించినను వారాతనిపై నాగ్రహింపరు. నేడు జరిగిన యవమానమునకు మూర్ఖుడైనను వాపోవడు. ఇతరుల ప్రోద్బలము లేనిదే యాతడెన్నడును సార్వభౌమునిపై కత్తిగట్టడు ! ! ! ! ప్రతీకారమును కాంక్షింపడు. ! ! ! ! ! తమరీ పశ్చాత్తాపమును బొందుడు. తమజీవితానంతరము తమసింహాసనమున కపఖ్యాతి రాజనదు. ప్రస్తుతము సలీము రాకుమారుడు పసిబాలుడు. క్రమముగ నతని ప్రవర్తనయు చక్కబడగలదు. ఏల వృథా వ్యథలపాలయ్యెదరు ? ...

అక్బరు:—స్నేహితుడా ! నీహృదయము పవిత్రమైనది. నీ యుద్దేశమును గ్రహించితిని. చింతవిడిచి యుండుటకు బ్రయత్నింతును. పొరపాటు జరిగినది. మరి చింతించి లాభము లేదు.

ఫజిలు:—ప్రభూ ! సంతోషము. తమహృదయమున కూరట గల్గినందుల కానందమైనది. సభా భవనమున జరిగిన కృత్యమమునకు మీహృదయము వ్యథలపాలగునని యెఱింగి త్వరపడి వచ్చితిని. వచ్చిన

కార్యము నెరవేరినది. పోయి వచ్చెదను. ముర్రాజు సంగతి మరి మరచిపోండు. సెలవు...

[ఇరువురును లేతురు. ఫణి వెడలిపోవును. చక్రవర్తి ఆలోచించుచు నిటునటు పచారు చేయును]

---

# రషీదా

## ద్వితీయాంకము

### ప్రథమరంగము

ఢిల్లీలో ఉద్యానవనప్రాంతము

[ప్రవేశము : రషీదా చీకాకుతో]

ఈ నావిచారమున కంతము లేదా! ప్రభూ! ఎన్నడును నాపై కోపమెరుగని జనకుడు నేడింతగ మారిపోయినాడే!!! ఆలోచనల కంతము లేక తహతహలాడుచున్న నా తండ్రికా మతాధికారేదియో బోధించి వెడలియుండును. ఈ మతాధికారులకు ... అగ్బరుసార్వభౌమునిపై నెంత క్రోధము?? వీరికి రాజకీయవిషయములలో జోక్యమెందులకో!!! పరిస్థితులను బట్టిచూడ సార్వభౌమునిపై వీరందరును జేరి యేవియో కుట్రలను బన్నుచున్నట్లనుమానము తోచుచున్నది. నా దురదృష్టవశమున నా తండ్రి యీ కుట్రలలో పాల్గొనుచున్నాడు. ముందేమి జరుగనున్నదో కదా!!! [విచారముతో తలవంచి కూర్చుండును]

[వెనుకనుండి మెల్లగా కుమారసేనుడువచ్చి రషీదాకన్నులు మూయును]

రషీదా:—కుమార్ ! వదలుము.

కుమారసేనుడు:—[తెల్లబోయి] రషీదా ! [ముఖము తేరి పారచూచి] నేడింత చికాకుగనుంటివేల ?

రషీదా:—అవును. పరిస్థితులు విషమించినవి !

కుమార్:— [ఆశ్చర్యముతో] పరిస్థితులు విషమించినవా ? పరిస్థితులేమి ? ........విషమించుటయేమి ? ? ఏమది రషీదా ?

రషీదా:—కూర్చొనుము.

[రషీదాపక్కకు జరుగగా, కుమారసేనుడు సోఫాలో ఆమె ప్రక్క నాసీనుడగును]

రషీదా:—కుమార్! నీ వీ మధ్య సభాభవనమునకు పోవుట లేదూ ?

కుమార్:— [సాలోచనగా] అహ్హా ! !...కొన్నిరోజులనుండి పోవుట లేదు.

రషీదా:—అదా ! నాతండ్రినీమధ్య సార్వభౌముడు బహిష్కరించినాడు.

కుమార్:—ఉహ్హు......సరే మంచిదే ! ముర్తాజు అదృష్ట వంతుడు! ! !

[చిరునవ్వు నవ్వును]

రషీదా:—[విసుగుతో] అబ్బ, అదృష్టముగాదు...నీకిప్పుడా హాస్యము?...కుమార్!!! నాతండ్రిని సార్వభౌము డవమానించినాడు. నాతండ్రి ప్రతిక్రియకై తహతహలాడుచున్నాడు.

కుమార్:—[ఆతృతతో] ఏమిటి రషీదా! అవమానమా? ముర్టాజుకు అవమానమా?? నిజమే! అంతటి స్వామిసేవాతత్పరునకు......అంతటి వీరాగ్రేసరునకు...అంతటి యిస్లాము మతభక్తునకు...అవమానమా? సార్వభౌముడంత త్వరపడినాడా? నిజమా రషీదా!!!

రషీదా:—నిజమే! కుమార్!! నిజమే!!! సార్వభౌముడు తొందరపడినాడు. సార్వభౌమునిలోని నిశ్చలత్వ మానాడు తొలగిపోయినది. కారణము నాతండ్రి దురదృష్టముగాక మరేమున్నది? చక్రవర్తితో విరోధపడి, సర్వనాశనము కలుగజేసికొనటము కంటె మరేమున్నది????

కుమార్:—ఉష్హూ

[ఆలోచనపూర్వకముగా కూర్చొనును.]

రషీదా:—నాతండ్రి ఘోరప్రతిక్రియకై త్వరపడుచున్నాడు!!!

కుమార్.—ఘోరప్రతిక్రియయా? రషీదా! ముర్టాజు అంత వేగిరపడవలసిన యవుసరము?? ఇతరుల ప్రోద్బలమా???

రషీదా:—అవును! కుమార్!! అవును! నాతండ్రికి పరు లెవ్వరో బాగుగ దుర్బోధనల గావించినారు. ఇప్పు డాతడు నామాటలను సైతము లెక్కచేయుట లేదు. నాతండ్రి సార్వభౌముని హత్యగావింప నుద్దే శించినాడు. [ఆతృతతో] కుమార్! ఇప్పుడు నా కేమి దిక్కు?

కుమార్:—రషీదా! ఏల ఈలీల బేలవై పలుబాముల పాల య్యెదవు? వంతచెందకుము...... సరిగాని మీ తండ్రికీదుర్బోధ నెవరు చేసియుందురు??

రషీదా:—కుమార్! నే నెరిగినంతవరకు...ఒక మతాధి కారి నాతండ్రితో నేదో గూఢముగా మాటలాడి నాడు. అతడే బహుశః యీపని యొనర్చియుండు నేమో. అతనిని నీవెరుగుదువా? పేరు మహా మ్మదుగవాన్.

కుమార్:—రషీదా! బహుశః అక్బరు...ఇస్లాము మత ద్రోహియని, గవాను నీతండ్రికి బోధించియుండును. ఈమత ఛాందసులందరకును అక్బరుపై విపరీత

మైన ఆగ్రహము. కారణము అక్బరు హిందూ మహమ్మదీయులను సమానముగ చూచుటయే!

రషీదా:—[నిశ్చయమును గనపరచుచు] జరిగినదేమియో జరిగి పోయినది. సార్వభౌమునికి మనమీ విద్రోహుల మూలమున నేవిధమైన అపాయమును రాకుండ చూడవలెను. ఈకార్యమున నా ప్రాణములనైన గోల్పోవుటకు నేను సిద్ధముగ నున్నాను.

కుమార్:—రషీదా! నీవిశాలభావమెంతయు ప్రశంశనీయము. నేనును ఈకార్యములో తగువిధముగ పాల్గొందును.

రషీదా:—కుమార్! నీకు పెక్కువందనములు. ఇంటినుండి బయలుదేరి చాలతడవైనది. పోయివచ్చెదను. సెలవు...

[ఇరువురును లేతురు. రషీదా కుమారసేనుని హస్తమును గ్రహించి, యాతనికన్నులలోనికి తనకన్నులుంచి చూచి, చిరునవ్వునవ్వి, వెడలిపోవును.]

కుమారసేనుడు:—[ఇటునటుదిరుగుచు]

మానవుడేమితలపెట్టిన దైవము దానికి వ్యతిరిక్తుడగును... చిరకాలమై నాటికొనిన మా ప్రేమ, చిగిర్చి ... పుష్పించి ... ఫలించుకాలము సమీపించునప్పటికి ప్రకృతియే మారిపోయినది.

క్షణములో నెంతమార్పు!!! కొద్దిరోజులలో వివాహితులముగానున్న మేము ...నేడు రాజ ప్రాణరక్షణార్థమై పాటుబడవలసి వచ్చినది. ఈ యుద్యమమున రషీదాకెట్టి యపాయమును రాదు గదా!..........నా హృదయమేలకో భయము చెందుచున్నది. అపాయసూచనలే కనపడుచున్నవే! అక్కటా! దైవమా! సత్కార్యనిర్వహణమునకై పాటుబడుచున్న సతీమణికెట్టి అపాయముల నిలువ యుంచితివో గదా!!

[ఒకచోనాగి] ఏహ్యమై, తుచ్ఛసుఖముల కాల వాలమై, దుర్మార్గుల కాటపట్టయి...పిశాచకళల వెల్లిగక్కుచున్న ఈ ప్రపంచమునందు, రషీదావంటి ప్రేమమయిలు...ప్రణయాధిదేవతలు ఎందరో లేరు!!!!!!!

రషీదా! నీవు ధన్యమూర్తివి!!! త్యాగ మూర్తివి!!! అధికారము కొఱకు ...... ఆడంబరముకొఱకు ... ... ఎన్నెన్నో ఘోర కృత్యములు జరుగుచున్న యీ రోజులలో, నీవు రాజక్షేమాభిలాషిణివై ... ...కన్నతండ్రిని సహి తము .....అతడు విద్రోహియైనపుడు .....విడనాడి తివి!!! ఈనీదీక్ష ...... రాజసేవాకాంక్ష......

ఎంతయు ప్రశంశనీయము గదా!!!! కాని ఈ నీ ప్రయత్నము సఫలమగునా! కానిమ్ము. ఇంతటి త్యాగమూర్తివి...నీవు భౌతికప్రపంచమును వీడి నను నా ప్రేమసామ్రాజ్యము నెప్పటికిని వీడ జాలవు!!!!

[ఇటునటునిశ్శబ్దముగ కొంతసేపుతిరిగి, ఒకచోనాగి మెల్లగా]

రషీదా! ఏనాడు విఫలమనోరథవై నీవీప్రపంచమును విడిచెదవో...ఆనాడే ఈకుమారసేనుడు తన రాజసేవకు నీరువదలును. ... ఆనాడే అతడు స్వర్గరాజ్యాభిషిక్తుడగును. !!!! ఈ భౌతికప్రపంచమున మన సమాగమము దుర్లభమగుచో అచ్చట దుర్లభముకాదుగదా!!!! ...

[పైవంకచూచి చేతులుమోడ్చి]

ఓభగవంతుడా! నాప్రేమమయి ... ఆ ధన్యమూర్తి...నా ప్రణయాధిదేవత...ఆ త్యాగమూర్తి ... ...రషీదాను నీవు రక్షింపవా ?? ఆత్యాగమూర్తిని కాపాడవా ?? ఈదీనులపై నీకృపావీక్షణముల బరుపుము ... ... దయయుంచుము... ...

[వెడలిపోవును.]

# ద్వితీయాంకము

## ద్వితీయరంగము

మురా౛జుగృహము : రహస్యాలోచనామందిరము

[ప్రవేశము : మురా౛జు; రాజు; సలీము]

మురా౛జు:—యువరాజా! తమరీయాసనము నధిష్ఠించుడు.

సలీము:—[కూర్చుని] మీరిరువురును కూడ కూర్చుండుడు.

[ఇరువురును కూర్చుందురు]

మురా౛జ్! నేనెందులకిచ్చట కరుదెంచితినో గ్రహించితివా?

మురా౛జు:—[ఆలోచనా పూర్వకముగా] తెలియలేదు యువరాజా! కాని మీరు బహుశః ఈ విద్రోహు...

సలీము:—ఇస్. నిశ్శబ్దము. ఇచ్చట పరులెవ్వరును యుండరు కదా!

మురా౛జు:—[రోషముతో] ఏమీ! నా గృహములో కూడ గూఢచారు లుందురని తలంచితిరా?

సలీము:—లేదు. మురా౛జ్. లేదు. మనము సావకాశముగా మాట్లాడుకొనవచ్చును గదా. ఇంతకును మీరీ కార్యమును తలపెట్టిన కారణము???......

ముర్తాజు:—కారణము బహుశః మీకు తెలిసి......

రాజు:—[ముర్తాజునాపి] నీ వూరుకొనుము. నేను సావకాశముగా యువరాజునకు బోధచేసెదను.

[యువరాజునిక్కై] యువరాజా! ఈ కార్యము కేవలము స్వార్థముకొఱకు తలపెట్టినదికాదని మనవి. మతద్రోహులు విజృంభించి మతము నవమానించుచున్నప్పుడు చూచుచు యూరకుండుట పాడికాదు. నేడిస్లామమతము ఘోరాపదలలో నున్నది. కాన ముర్తాజు బోటి పవిత్ర ఇస్లామమతస్థులు మతరక్షణార్థమై ముందునకువచ్చుట పాడికాదందురా?

సలీము:—[ఆలోచనాపూర్వకముగా వినుచుండును]

ముర్తాజు:—యువరాజా! స్నేహితుడు రాజు యదార్థము వాక్రుచ్చినాడు. కేవలము మతరక్షణార్థమై ప్రారంభింపబడిన మాయీ ప్రయత్నమునకు తాము సంపూర్ణాంగీకారమును గనుపరుపవలెనని మా మనవి.

సలీము:—ముర్తాజ్! వివేకవంతుడవై నీ యాశయమును నెరవేర్చుకొనుము!!!

రాజు:—ముర్తాజ్! సలీము రాకుమారులు వివేకవంతులు. పవిత్ర ఇస్లామ మతస్థులు. అట్టి యువరాజు

రాజ్యాభిషేకము మనము కన్నులారగాంచు
భాగ్యమెప్పుడో కదా !

సలీము:— [సంతోషముతో నుప్పొంగి] ఇస్ ...... ఆ విషయ
మును పోనిందు...

రాజు:— యువరాజు బడలినట్లున్నారు ...... కొంచెము
... తెమ్ము.

[ముర్తాజునకు కనుసైగ చేయును]

ముర్తాజు:— [కొంచెము మెల్లగా] రాజా ! నేనిప్పుడే వచ్చె
దను. యువరాజు స్వీకరించునో ......

రాజు:— ముర్తాజ్ ...... తెమ్ము ......

[ముర్తాజు వెడలిపోవును]

సలీము:— రాజా ! ప్రస్తుతము మనవిధి ? ? అబ్దుల్
ఫజిలుమాట ???

రాజు:— ఇస్ నెమ్మది. ఆవిషయము నిచ్చట నెత్తకుడు.
ఫజిలు ముర్తాజునకు గురువు.

సలీము:— [నిస్పృహతో] అట్లయిన నేవచ్చిన కార్యము
వ్యర్థమయ్యెనన్నమాటయేనా ?

రాజు:— యువరాజా ! మీరీవిషయమై ఎంతమాత్రమును
సందేహము బెట్టుకొనకుడు. ఈ మీవిశ్వాస
పాత్రుడైన రాజు స్వహస్తములతో నాకార్య
మును చక్కబెట్టును.

సలీము:—రాజా! సంతోషము. ఇక ఫజిలునుగూర్చి మనము విచారింపవలసిన పనిలేదు. కాని నిశ్చయ మేనా? ఎంతత్వరలో ఆతడిహలోకమును వీడిన మనకు అంతమంచిది. తెలియునా రాజా!

రాజు:—చిత్తము. ఆకార్యము శీఘ్రముగనే నిర్వర్తింప బడును.

సలీము:—కాని రాజా! ముర్తాజు సార్వభౌముని హత్యా ప్రయత్నములో నున్నాడు. సార్వభౌముడు మర ణించిన మనకు మేలేగాని కీడుగాదు. కాని ప్రస్తుత మిది పనికిరాదు. కారణము......దర్బారులో నాకెందరో స్నేహితులులేరు!!! కావున ఇప్పుడు సార్వభౌముడు మరణించుచో సింహాసనము నాకు దక్కదు. ఖుస్రూ చక్రవర్తి గావింపబడును. కాన నిప్పుడు సార్వభౌముడు హత్యగావింపబడుట మనకు చేటేగాని మేలుగాదు!!!! మరి యీ విషయమై నీ యభిప్రాయమేమి? రాజా!

రాజు:—యువరాజా! మీ కావిషయమై చింత యనవ సరము. సార్వభౌము డెన్నడును ముర్తాజువలన నపాయమును పొందనేరడు. ఫజిలువిషయమున మీరు సందేహపడవలసినపనిలేదు. కాని ముర్తాజు సార్వభౌముని హత్యావిషయమై ప్రస్తావించి

నపుడు తా మంగీకారమును జూపవలెను.......

అదుగో వచ్చుచున్నాడు ముర్తాజు.

[తిరిగి ప్రవేశము : ముర్తాజు సారాయముతో]

[ముప్పురును సారాయమును గ్రహింతురు]

సీమః—ముర్తాజ్ ! నీయాతిథ్యము నాకు చాల నానంద మైనది.

ముర్తాజుః—చిత్తము. నిర్ణీతదినము రేపురాత్రి.

రాజుః—దేనికి నిర్ణీతదినము, ముర్తాజ్ !

ముర్తాజుః—ఇస్లాముమతద్రోహి పరలోకయానమునకు...

సీమః—సెబాస్ ! ముర్తాజ్ !! సెబాస్ ! సార్వభౌము డైనను ఇస్లాముమతద్రోహియైనపుడు దండ నార్హుడే !

ముర్తాజుః—[సంతోషముతో] ఇప్పటికి నాయాశయము నెర వేరినది. యువరాజుకూడ యంగీకరించినాడు. ఓ భగవంతుడా ! నా ప్రయత్నమును నిర్విఘ్నముగ నెరవేర్పుము.

[భగవద్ధ్యానము చేయుచుండును. యువరాజు- రాజు కను సైగలుచేసికొని చిరునవ్వు నవ్వుకొనుచుందురు]

ముర్తాజుః—[కన్నులుదెరచి] సంతోషము. యువరాజా ! తమ ప్రోత్సాహము నాకు మిక్కిలి యానందమును గలిగించినది.

పరీమా:—ముర్తాజా! నీ హృదయము పవిత్రమైనది. పోయి వచ్చెదము...... సెలవు.

[ముగ్గురును లేతురు. యువరాజు ముందు నడచును. రాణి, ముర్తాజా వైపు [illegible] కదలిపోవును]

ముర్తాజా:— పవిత్రకార్యమునకు...... న్యాయశాస్త్రమునకు... అడ్డంకులువచ్చుట అరుదు. దైవమా నీపై భారమువైచినాను!!

[ఆలోచించుచు నిలుచుండును]

# ద్వితీయాంకము

## తృతీయరంగము

అబ్దుల్ ఫజిలు గృహము

[ప్రవేశము : అబ్దుల్ ఫజిలు చేత కాగితముతో]

ఎచ్చటనుండియో ఈ యుత్తరము వచ్చినది. పంపిన వారిపేరు కానబడదు! తెచ్చినవారెవరో తెలియదు!! లేఖ ఏదోయొక గూఢ రహస్యమును వెల్లడించుచున్నది. ఎన్నిసారులు చదివి చూచినను మదికెక్కలేదు. మరలనొకపరి చదివి చూచెదను.

ఆర్యా!

ప్రేమపూరితమయిన మనము పలుప్రేరేపణలచే పాపపంకిలమైనది. వికచవికసిత గంధపూరితంబైన సంపెంగంబుదరిని వహ్నివిషముల గ్రక్కు కాలసర్పముగలదని కలగాంతురా!!! కాని యామినీనాథోదయాత్పూర్వమే కాల సర్పము సార్వభౌముని కాటువేయ నుంకించుచున్నది. వేగిరమె తగు శ్రద్ధగైకొనవేడెద......

ఇట్లు
రాజశ్రేయోభిలాషి

[కొంచమాలోచించి] ఇప్పటికి కొంతవరకు స్ఫురించినది...ఒక రాజభక్తుడు సార్వభౌమునకు రాబోవు అపాయమునుగూర్చి ముందుగనే తెలియబరచినాడు...ఈ లేఖ కొంతవరకు తన కృత్యమును నెరవేర్చినది. ఆహా! కలియుగ ప్రభావము గాబోలు!!! చక్రవర్తి సచ్చరిత్రుడు!...సన్మార్గుడు!!...శాంతిదూత!!! ...అట్టి దేవాంశసంభూతునకు మరణమా??? దీర్ఘక్రోధాఫలితము!!! ...భయంకరహత్యయా??? ఛీ! హంతకులారా! మీకేల ఈ దుర్బుద్ధి పొడమినది? పవిత్రుడైన రాజునుజంప మీరేల గాంక్షించు

చున్నారు? మిమ్ములను ప్రోత్సహించినది ధనాశయా?... ఘోరప్రతిక్రియావాంఛయా?... మతమా?.....రాజసేవాపదచ్యుతియా?..... స్వకీయక్రోధోన్మాదమా?.....విధియా?...... మరేమి??? వీనిలో మీరు దేనికి దాసులైనారు!!! క్రూరకర్ములారా! పైన భగవంతుడే కలడేని మీరు విఫలయత్నులగుటయే గాక, సచ్చరిత్రుడైన సార్వభౌముని చంపనుంకించిన చెనటులగు మీకు తగిన శిక్షలు ప్రాప్తింపకుండునా!!!! కానిండు. నేను ధర్మము జయమందునో... అధర్మము ఖ్యాతిగాంచునో ......

ఈ లేఖను సార్వభౌమున కందజేసి వారిని తగుకట్టుదిట్టములలో నుంచెదను.

[చేతులుజోడించి] సార్వభౌమా! ఈ మీ సేవకుని బొందిలో ప్రాణమున్నంతవరకును మీకు మరి ప్రాణాపాయములేదు. ఈ కేశజాలము మొగలాయీవంశతిలకుడవగు నీ సేవలో పలితములై పోయినవి. భగవంతుడు కరుణామయుడు!!!! ... శిష్టులపాలిటి కల్పతరువు!!!! ... దుష్టులపాలిటి యమస్వరూపుడు!!!!!!

[కొంచెమాలోచించి] చక్రవర్తి ఇప్పుడంతఃపురములో యుండును. అచ్చటికేవెళ్ళి ఈ లేఖనిచ్చి యతనిని తగుజాగ్రత్తలో నుంచెదను. !!!!.......

[ఫజిలు ఆలోచించుచు వెడలిపోవును]

# ద్వితీయాంకము

## చతుర్థ రంగము

చక్రవర్తి ఆలోచనా మందిరము.

[ ప్రవేశము అక్బరు ]

[సాలోచన పూర్వకముగా] మున్రాజు విద్రోహియై నాడట! ఆహా! కాలమహిమ. అయినను తప్పు నా యందుంచుకొని పరుల నిందింపనేల? పవిత్రు డైన రాజభక్తు నవమానించితిని. అతడు ప్రత్యక్ష విరోధియైనాడు. తప్పులేదు ...... కాని నా కాత డపాయము జేయునా? ఏమో...... ముందుగనే యాతని నేల బంధింపగూడదు. ఛీ! మనమా! నీవేల వక్రగతిపట్టెదవు. మొదట రాజసేవకు నవ మానించితిని! ...... ఆపైన యాతడు విద్రోహి యాయెనని యూహించితిని !!......ఊహించినంత

మాత్రముననే నిజమారయక ఆతడు నా కపా యము గల్పించునని శకించితిని!!!...... శంకించి నంతమాత్రముననే ఆతనినిపట్టి బంధింప నుంకించు చుంటిని !!!!...ఛీ ఎంతటి అవివేకిని !

[విచారముతో తలవంచి కూర్చుండును]

[ ప్రవేశము—అబ్దుల్ ఫజిలు ]

సార్వభౌములు చింతాక్రాంతులైయున్నారు ?...

అక్బరు:— చింతకాక ! రాజభక్తుడైన ముర్తాజు నేడు విద్రోహియైనాడు !!

ఫజిలు:— [పాలోచనగా తలపైకెత్తి] బహుశః అతడేయై యుండవచ్చును.

అక్బరు:— [ఆత్రముతో] ఎవరు? మిత్రమా ! ఆతడెవరు ?

ఫజిలు:— మరేమియును లేదు. నేడు నాకొక లేఖ వచ్చి నది. త్వరపడి దానిని దేవరసన్నిధికి గొని తెచ్చితిని. ఆలేఖలోని ముఖ్యాంశము...మీరు చెప్పిన విష యమునకు సరిపోయినది. అందుచే నట్లంటిని.

అక్బరు:— [ఆత్రముతో] ఏదీ ! ఆ లేఖ ...

ఫజిలు:— ఇదిగో. మీరును పరీక్షింపుడు.

[లేఖనిచ్చును]

అక్బరు:— [లేఖనుచదివి] తమయూహ నాకర్థముగాలేదు!!!

ఫజిలు:—[చిరునవ్వుతో] ముర్టారాజు విద్రోహియైనాడని సెల
విచ్చినారుగదా తమరు! ఆ లేఖలో "ప్రేమపూరిత
మైన మనము పలు ప్రేరేపణలచే పాపపంకిల
మైనది" అనుటలో ఆయర్థమే స్ఫురించుచున్నది.
ముర్టారాజు భక్తితో సేవించినాడు!......విధివశ
మున అవమానింపబడినాడు!!... పలువురు ప్రేరే
పింపగా మీపై కత్తిదూసినాడు!!!......ఇదియే
విషయము. నేడే నిర్ణీతదినము. తమరు తగు
విధమున నాత్మరక్షణ మొనర్చుకొనవలెనని నా
మనవి.

అగ్బరు:—మిత్రమా! తమ అనిర్వచనీయ వాత్సల్యమునకు
నావందనములు. నేనును తగుకట్టుదిట్టములలోనే
యుండెదను.

[ప్రవేశము—ఒక సేవకుడు]

[సార్వభౌమునకు వంగి నమస్కరించి]

ప్రభూ! ద్వారముకడ మానసింగు ప్రభృతులు
వేచియున్నారు.

అగ్బరు:—వేగిరమే ప్రవేశపెట్టుము.

[సేవకుడు నిష్క్రమించును]

[ప్రవేశము—రాజామానసింగు; అబ్దుల్ రహమను]

అక్బరు:—కూర్చుండుడు.

[ఇరువురును అక్బరుకు సమస్కరించి కూర్చుందురు]

ఫజిలు:—సోదరులారా! ఒక విద్రోహివలన నేటిరాత్రి సార్వభౌమున కపాయము వాటిల్లనున్నది!

ఇరువురు:—ఏమీ! సార్వభౌమున కపాయమా?

ఫజిలు:—అగును. విద్రోహి ముర్టాజు!!!

అబ్దుల్ రహమను:—సార్వభౌమా! ఆనతిచ్చిన ముర్టాజును మరునిముసమున బంధించెదను.

అక్బరు:—రహమన్! నీ స్వామిభక్తికి సంతసించితిని. వేగిర పాటువలదు.

ఫజిలు:—సార్వభౌమా! నాకొక యూహ తట్టుచున్నది. తాము నేటిరాత్రి యొంటరిగ కుతుబ్ మీనార్ వద్దకు పొండు. వెనుకను, చుట్టును రక్షకభటా వళితో మానసింగు, రహమనులు కాచియుందురు. హంతకుడు తప్పక పట్టుబడునని నామనవి.

మానసింగు:—ఈయూహ ప్రశంశనీయమైయున్నది. సరిగ 10 గంటలైనది. సార్వభౌమా! మీరొకగంటలో అచ్చటికి వెళ్లినచో మేమును వెంబడించి త్వరలో మిమ్ములను కలిసికొందుము. మేము మాప్రయత్నములలో నుండెదము. సెలవా? ...

అగ్బరు:—సరియే మీరును పొండు. నేనును వచ్చెదను.

[మానసింగు, రహమనులు పోవుదురు.]

మిత్రమా!

ఫజిలు:—మరి భయము లేదు. భగవంతుడు కృపామయుడు.

అతని కృపామయదృష్టి మనపై ప్రసరించుగాక!

[ఇరువురును లేతురు]

---

# రషీదా

# తృతీయాంకము

## ప్రథమరంగము

**కుతుబ్ మీనార్ పరిసరప్రాంతము**

[ప్రవేశము : అక్బరు చేతవిల్లు ధరించి]

నామనస్సు పశ్చాత్తాపముచే దహించుకొని పోవుచున్నది. నా కూరటలేదు. ముర్తాజువిషయము స్మృతికివచ్చినపుడు నాకు గల్గు విచారమునకు మేరలేకున్నది.

[మెల్లగా నడిచిపోవును]

[ప్రవేశము : ఒకతురుష్కయోధుడు]

ఈ నాటితో ఇస్లాముమతద్రోహి సమసిపోవును.

[మెల్లగ నడచిపోవును.]

[ప్రవేశము : ఒకయువకుడు]

సమయమున కేతెంచితిని. ఇక సార్వభౌముని రక్షణోపాయమును వెదకవలసియున్నది.

[మెల్లగ నడచిపోవును]

[అక్బరు ఆలోచనాపూర్వకముగా ప్రవేశించి ఏకాగ్రదృష్టితో జేనిపై పరిశీలించుచు విల్లు సెక్కు పెట్టును. వెనుకగా యువమ్క రాధుడు ప్రవేశించి, కరవాలమునెత్తి, దిగ్గరగా]

పాపీ!చావుము. పవిత్ర ఇస్లాముమతద్రోహివి.
నీకు మరణమే శ్రేయస్కరము.

[అక్బరును కత్తితో పొడువ యత్నించును. రెండవయువకుడు దగ్గరున కడ్డమైనిలచి ఆకత్తిపోటున కెనయగును. బాధానూచక ఆర్తనాదము. యువకుడు క్రిందపడిపోవును. తెరలో కలకలము--సైనికులు వచ్చిన ధ్వని. క్రిందపడిన యువకుడు లేచి పారిపోవును. హంతకుడు పట్టుబడును]

[ప్రవేశము : అబ్దుల్ ఫజిలు; అబ్దుల్ రహమను]

రహమను:—ప్రభో! సమయమునకే రాగలిగితిని. దేవర
వారు సురక్షితులే గదా!

అక్బరు:--అల్లామహిమాన్వితుడు. నన్ను కాపాడి బాకు
పోటునకు గురియైన ఆయువకుడేడీ?

ఫజిలు:--ఏయువకుడు ప్రభూ!

అక్బరు:— మిత్రమా! నన్నపాయమునుండి రక్షించినట్టి
యాతడొక యువకుడు. విద్రోహి నన్ను దునుమ
యత్నించునంతలో ఆయువకుడు తళుక్కున మెరసి
యా కరవాలధారకు తానే యెనయైనాడు.

ఫజిలు:—భగవంతుడు కరుణామయుడు. అతని కృపామయ దృష్టి మనపై ప్రసరించుగాక!

అక్బరు:—రహమను! ఆయువకుడు కనుపించినాడా?

రహమను:—లేదు ప్రభో! ఆతడు కనుపించనే లేదు!!

అక్బరు:—అయ్యో! నేనెంతటి అవివేకిని. నా ప్రాణదాతను బహూకరింపజాలనైతిని. తుదకాత డెవ్వరోగూడ ఎరుంగనైతిని.

రహమను:—దేవా! నేరస్థుని చెరసాలయొద్దకు గొంపో యెదను.

అక్బరు:—నేరస్థు డెవడు?

ఫజిలు:—[చిరునవ్వుతో] చిరపరచితుడు...మురాజు!!!

అక్బరు:—మురాజా! ఛీ విద్రోహి!! కృతఘ్నుడు!!! రహమన్! నేరస్థుని బందిఖానాలో వేయుడు. రేపాతడు సభాభవనమున విచారింపబడును.

రహమను:—చిత్తము!

[భటులం వెంటరా, నేరస్థునితో వెడలిపోవును.]

అక్బరు:— మిత్రమా!

[విచారముతో తలవంచుకొనును]

ఫజిలు:—దేవా! గడచినదానికి వగచి పనిలేదు. భగవంతుడు తన ప్రేమపూరిత నయనములతో మన

లను తిలకించుచున్నాడు. నేడుగానిచో రేపయి
నను ఆయువకుడు కనుపింపకపోడు. అయినను,
ప్రభూ! నాకొక యూహతట్టుచున్నది. సైనికులు
నలుగడల నుండుటచే ఆయువకు డిచ్చుటనే యెచ్చ
టనో పొంచియుండును. దేవరవారు అంతఃపురమున
కేగుడు. నేనాతని వెదకి తెచ్చెదను.

అక్బరు:—మిత్రమా! కడు మెలకువతో వర్తింపుము.

[అక్బరు వెడలిపోవును]

ఫజలు:—కేవలము భ్రమ!......కలికాలము!! నమ్మ
రానిది !!!!...

[ఆలోచించుచు ఇటునటు పచారు చేయుచుండును.]

# తృతీయాంకము

## ద్వితీయ రంగము

కుతుబ్ మీనార్ పరిసరప్రాంతము

[ ప్రవేశము రాజు ఖడ్గముతో ]

అనుకొనినంత పనియు జరిగినది. ముర్తాజు
బందీకృతుడైనాడు. ఈ పన్నుగడనంతయు నెవరో
ముందుగనే చక్రవర్తి కెరుకపరచినారు. లేనిచో

[ప్రవేశము : రాజు]

తుచ్ఛుడా! సార్వభౌమునికి పూర్వమే నిన్ను బలి మార్పవలసినది. నీ కోరిక లీడేరునట్లు ముందుగనే మరణించుము.

[ఫజిలు ఉలికిపడి తలనెత్తునంతలో రాజు ఖడ్గ మాతని శరీర మందలి రక్తమును చవిజూచినది. ఫజిలు నేలరక్తముపార బిగ్గరగా 'హాత్యా' యని యరచి పడిపోవును.]

[తెరలో కలకలము - సైనికులువచ్చిన ధ్వని]

రాజు:——[సంతోషముతో] ఆహా! ఇప్పటికి నా ఆశయము నెరవేరినది. ఏ నాటినుండియో వేచియున్న చిరకాంక్షిత మీనాడు ఫలించినది.

[ఫజిలుగుండెలపై కాలుంచి] పాపీ! తగిన ప్రతీకారమునే గాంచితివి. ఈతడు తనకు చేసిన యపకారమును మరచునని భావించితివా? లేక రాజునకు గల శక్తిసామర్థ్యము లెంతయని నిర్లక్ష్యము చేసితివా?......దుర్మార్గుడా! కాలము సమీపించినది గావుననే నేడు నీవు అగ్బరు ప్రాణదాతకై వెతకుచుంటివి. మరి నీకిచ్చట నే ప్రాణదాత లభించును?

[తెరలో మరల కలకలము - సైనికులువచ్చినధ్వని]

రాజు:—అహో! పొరబడితిని. సైనికులువచ్చి చుట్టు ముట్టినట్లున్నారే! నాకు కారాగృహప్రాప్తి కాదుగదా! ఛీ! పవిత్ర రాజపుత్రవంశీయుడ నైన నేను ప్రాణములతో బంధింపబడుటయా? నేనేల భయపడవలెను. నాచిరకాంక్షిత మీడేరినది!!! యువరాజు సఫలీకృత మనోరథుడైనాడు!!!! ఇక కావలసినదేమి? ప్రాణములపై తీపియా? నాకెన్నడును లేదు! ఏమగునో చూచెదగాక.

[ఖడ్గము చేతధరించియుండును]

[ప్రవేశము - మానసింగు కరవాలముధరించి]

మానసింగు:—[తేలజూచి] హా! తలంచినంత యయినది. కేకయూలమునసే హత్యగావింపబడినది. మిత్రుడని యనుమానించితిని.

[రాజువంక కోపముతో చూచుచు] దుర్మార్గుడా! కుల ద్రోహీ!! ఎంతపనిగావించితివి? పవిత్రుడైన యబ్దుల్ ఫజిలును హత్యగావించి రాజపుత్రవంశ మున కంతకును కళంకము నాపాదించితివే!!!! నీవింతటి ఘోరకృత్యమాచరించుట కా మహాత్ము డొనర్చిన యపకారమేమి రాజూ!

రాజు:— తుచ్ఛుడా! నాకు నీతులుగరప యత్నించు చుంటివా? పవిత్ర రాజపుత్ర వంశీయుడవయ్యు, ముసల్మానును బానిసవైతివి. అంతకంటెను నైచ్య మున్నదా??

మానసింగు:—మాటలేల. పరిస్థితులు తేటతెల్లమైనవి. కాచుకొనుము.

[ఇరువురును యుద్ధముచేతురు. రాజు నేలబడి పట్టుబడును]

మానసింగు:—ద్రోహీ! తగిన బహుమానమును త్వర లోనే పొందెదవులే. పవిత్రుడైన ఫజిలును చం పిన పాపమూరక పోవునా.

[సేవకులతో] సేవకులారా! ఈతనిని కారాగార బద్ధుని జేయుడు.

రాజు:—[వికటాట్టహాసమును గావించి] మానసింగ్జీ! మీరు పొరబడితిరి! పవిత్ర రాజపుత్ర వంశీయుడనైన నేను, ముసల్మానుడు విధించు శిక్షననుభవింతునా? ఏక్షణమున నేను పట్టుబడితినో, ఆక్షణముననే శిక్షను విధించుకొంటిని. ఇక తడవేల. ఇప్పుడు రాజమిత్రుని జంపి రాజద్రోహి నైనను...... యువరాజునకు, భావి మొగలాయి సార్వభౌము

నకు ప్రీతిసల్పి రాజమిత్రుడనే యైతిని !!!!! నా కిహాలోకములో నికతావులేదు. సెలవు... ... ...

[ ఖడ్గముతో పొడుచుకొని చనిపోవును]

మానసింగు:— [సేవకులతో] ద్రోహి మరణించినాడు. ఫజిలు శరీరము నిరువురు చక్రవర్తి సాన్నిధ్యమునకు గొని పొండు. నేనును వెనుకవచ్చెదను.

[సేవకులు ఫజిలు శరీరమును మోసుకొని పోవుదురు]

మానసింగు:—[కొంచెమాలోచించి] ఈ హత్యలో యువరాజు నకుగూడ కొంత సంబంధమున్నదన్నమాట !!!! ఛీ. త్రాగుబోతు !! ...ఎంతవరకు వచ్చినాడు. ఈవిషయమును సార్వభౌముని చెవినిబడనీయ రాదు. మిత్రునిమృతికి వగచుచున్న చక్రవర్తి యెంతపనినైన చేయును...

ఈసరికి సేవకు లంతఃపురమును చేరియుందురు. నేనును బోయెదను.

[మానసింగు నిష్క్రమించును.]

# తృతీయాంకము

## తృతీయరంగము

**చెరసాలలో**

[ప్రవేశము : నేరస్థుడిటునటు పచారుచేయుచు]

ఆహా! ఎంతటిఘోరకృత్యము జరిగినది. అయ్యో! ఒక్కక్షణము... ...ఒక్క క్షణ మాయువకు డాలసించినయెడల ఆపాపి జీవితము నపహరించెడివాడనుకదా!... దుర్మార్గుడగు అగ్బరు మడిసిన పిమ్మట నన్ను చెరపెట్టిననేమి? హా! దైవమా! నీవును నాకు ప్రతికూలుడవైతివా? అత డిస్లాము మతద్రోహియని కాదా...... నేనాతని ప్రాణాపహారణమును దలపెట్టినది!!! అల్లా నాకు ప్రతికూలుడాయెనుగదా!

ఆహా! రేపు నాకు మరణదండన విధింపబడునుగాబోలు. [ఉద్వేగముతో] అయ్యో! నా ముద్దులకూతురు మాటల విననైతినే!! ఆమెగతి నా మరణానంతర మేమగును? పాపము తల్లి లేదని యామె పెట్టిన మొరల నాలకింపనైతిని గదా!! ఆహా! రషీదా!! నా ముద్దులకుమారీ!!!

నీ ముద్దుమోమిక వీక్షింపలేనా ? నీ నగుమో మిక గాంచలేనా?? హా! హాతవిధీ! ఎంతటిదైన్య మునకు బాల్పడజేసితివి!!!!

[ఒకచో నాగి, రోషముతో] ఇంతకును కారణ భూతుడెవడు? ఇస్లాముమతద్రోహియైన అక్బరు గాడా మరి. హా! నేను పొరబడుచున్నాను. పొరపాటొనర్చితిని. సమయము మించిపోయినది!!! విధి వ్యతిరేకించినది!!!! దైవము నాకు ప్రతికూల మైనది!!!!! కాని నా మరణదండనకు నే విచా రించుటలేదు........నా జీవితవ్యథ యింతటితో హరించును. కాని......కాని...ఏ పవిత్రకార్య మును నే దలపెట్టితినో, యా కార్యమును నెర వేర్పజాలనైతిని... ...అయ్యో!...

[ఇటునటు దిరుగుచు] కుమారీ! నాకుమారి నవ యవ్వనవిలాసిని... ...రషీదా నిక నెవ్వరాద రింపగలరు? ... ...ఎవ్వరు పోషింపగలరు?? ... హా! మూర్ఖుడనై... వివేకహీనుడనై ... దయా విహీనుడనై ... పాపము! రషీదా నాపాద ద్వయముపైబడి—“వద్దు... బాబా! ... ...వద్దు. ఈ ఘాతుకకృత్యమునుండి మరలుము. నీకు శ్రేయస్సుగల్గును” ...అని ప్రార్థించినపుడు...

కళ్ల వెంట బొటబొట నీరుగార నా పాదద్వయ మునుబట్టి వేడినపుడు......దుర్మార్గుడనై యా మెను తన్నివైచితినిగదా!...పాపమామె యెంత దుఃఖించినదో !!! ఆమె లేతహృదయమెంత విల పించినదోకదా!!!! దానికి తగినఫలము ననుభ వించు చుంటిని.

[ఉద్వేగముతో, ఒకచోనాగి] నన్ను ద్రోహియని పిలిచిన నేనులజ్జింపను! ...మరణదండన విధించిన విచారింపను!! ...మరణింపవలసి వచ్చినందులకు వాపోవను!!! ......ప్రజలమొగము చూచుటకై సంకోచింపను !!!! ...కాని...కాని......నా ప్రియదుహిత ! ..."బాబా ! వలదు. ఈయుద్య మమునుండితొలగుము"...అనిహితబోధయొనర్చి నన్నురక్షింప సమకట్టిన సుగుణాలగని!!...చక్ర వర్తియందు నిష్కల్మషప్రేమగల్గిన రాజహితాభి లాషిణి!!!...రషీదాను ప్రజలెట్లు హింసింతురో గదా! హా! దుర్భరము...దుర్భరము!!

[ఇటునటు దిరుగుచు] పవిత్రాశయముతో పాపిని చంపవచ్చితిని!...దైవము వ్యతిరిక్తుడాయెను!!... పట్టుబడితిని !!! ......ప్రాణముల గోల్పోవ

నుంటివి!!!......మృత్యుదేవతా! నన్నుచూచి పరిహాసించుచుంటివా? పరిహాసపాత్రుడనే!!

[ఒకచో సాగి, క్రింద కూలబడి] విచారమా!... విచారమెందులకు? పవిత్రకార్యమునకై పాటు బడితిని. కాని ఫలితము దక్కలేదు! దైవము వ్యతిరేకించినాడు!! జరుగవలసినదేమో జరిగి పోయినది. కానున్నది కాకమానదు. అన్నిటికిని సంసిద్ధుడనైయున్నాను.

[హృదయముపై చేయివైచికొని] నా హృదయము దహించికొని పోవుచున్నది. హా! అదేమి?... అదేమి?? భూమి గిఱ్ఱున దిరుగుచున్నది! నా కళ్లు మండుకొనిపోవుచున్నవే. అయ్యో! అదేమి?... ఉరిత్రాడా?......రషీదా! ఇక నీకు దిక్కెవ్వరు? అయ్యో! ఎక్కడదీ ఆర్తనాదము......ఎవరా దుఃఖించుచున్నది. అయ్యో! కుమారీ! నీవా! నీ మొగమెట్లు కందిపోయినది. నీ దుఃఖమున కిక యంతములేదా? తల్లిమరణముతో ప్రారంభమైన నీ కష్టములు తండ్రిమరణముతో ఇమ్మడియగును కాబోలు!!! హా! దైవమా!! భరింపజాల... భరింపజాల......నా హృదయము బ్రద్దలగు

చున్నది.....సహింపజాల!...సహింపజాల!!...
రషీదా!!!!...రషీదా!!!! ...

[తూలి నేల బడిపోవును.]

# తృతీయాంకము

## చతుర్థ రంగము

### చక్రవర్తి దర్బారు

[అగ్బరు సింహాసనము నధిష్ఠించియుండును. తోడరుమాలు...రాజామానసింగులు కొద్దిదూరములో కూర్చుందురు. ఒకవైపున షేకుఫజిలు...మరికొందరు ఆస్థానోద్యోగులు కూర్చుందురు. మరొకవైపున నేరస్థుడు సంకెలలతో నిలువబడి యుండును.]

అగ్బరు:—[తనలో] నిష్కల్మషచిత్తు నవమానించితిని. నేడాతనికి ధర్మమనుపేర మరణదండన విధింప నుంటిని. రాజులెంతటి స్వార్థపరులు!...ఛీ నా హృదయమున నింకను దయ మొలకలెత్తుచున్నదే! ప్రియమిత్రుడు...అబ్దుల్ ఫజిలును జంపినద్రోహి కీతడు ప్రాణస్నేహితుడుగాడా మరి! అట్టితుచ్ఛునేమిచేసినను పాపములేదు.

[పైకిజూచి] మిత్రమా! ఫజిల్! నీఆత్మకు శాంతి యగుగాక !!

[తోడరుమాలుతో] స్నేహితుడా! ముర్టాజు నేరము సభికుల కెరింగింపుము...

**తోడరుమాలు:**— స్నేహితులారా! ఘోరకృత్యము జరిగి పోయినది. ముర్టాజు కొన్నిరోజులకు పూర్వము చక్రవర్తిచే అవమానితుడైనాడు. ఆతుచ్ఛుడు రాజపుత్రు నొకనిని సాయముచేసికొని సార్వభౌముని జంపనుంకించినాడు.

**ఆస్థానోద్యోగి:**—ఎవరు! ప్రభువును జంపనుంకించినాడా? ఘోరము... ఘోరము...

**తోడరుమాలు:**—అవును. సార్వభౌమునే జంపనుంకించినాడు. కాని దేవునిదయవలన సార్వభౌముడు రక్షింపబడెను. తుచ్ఛుడైన రాజుబారిబడి అబ్దుల్ ఫజిలు ప్రాణముల బాసినాడు! అట్టి వీరవతంసుని... సామ్రాజ్య సేవకుని......పవిత్ర స్నేహితుని... విఖ్యాతవైజ్ఞానికుని పోగొట్టుకొనిన మనమెంతయు దురదృష్టవంతులము. కాని రాజు...ఆత్మహత్యామూలమున ఇహలోకకష్టపరంపరలనుండి దాటిపోయినాడు. కాని పరలోకమునసైనను తన పాప

కృత్యమునకు తగినశిక్ష ననుభవింపకపోడు !!!...
ప్రస్తుత మీా ద్రోహికి తగిన శిక్షను విధింపవలసి యున్నది. షేకుఫజిలు అభిప్రాయమేమైయున్నదో??

**షేకుఫజిలు:**—[కొంత సేపాలోచించి] శిక్షకేమున్నది. ధర్మశాస్త్రమందు రాజద్రోహ నేరమునకు విధింపబడిన శిక్ష... ఘోరమరణదండన!...

**అగ్బరు:**—[తనలో]సార్వభౌముని చంపనుంకించినద్రోహి... తగినశిక్ష విధింపబడినది... కాని [విచారములో] నా హృదయమేలకో ముర్టాజును కనికరించుచున్నది. నామనస్సునకీ సంఘటమునల కన్నిటికిని కారకుడు రాజని తట్టుచున్నది. కాని ఆతని మూలమున పరిస్థితులు తారుమారైనవి. [మెల్లగా] తోడరుమాల్! రాజద్రోహ నేరమునకు మరియొక శిక్ష విధింపబడ లేదా???

**తోడరుమాలు:**—దేవరవారికి నే నేమని చెప్పగలను. ధర్మశాస్త్రవేత్తయగు షేకు అట్లే శెలవిచ్చినాడు.

**మానసింగు:**—[రోషములో, లేచి] ఏమిా! ప్రభువు కరుణించుచున్నట్లున్నది. ఆదుర్మార్గుని... కటికకరవాలధారకెన యొనర్చినను పాపములేదు!!!!

అగ్బరు:—[ఉలికిపడును]

ఒకఆస్థానోద్యోగి:—ప్రభువువారు నేరస్థునియెడ దయజూపుచున్నట్లున్నది. అట్టి రాజద్రోహి నగ్నియందు బడివేసినను పాపములేదు!!!

అగ్బరు:—[విచారసూచకముగా తలవంచుకొనును]

షేకుఫజలు:—దేవరవారనుగ్రహింపవలెను. రాజద్రోహికి మరణదండనకంటె శాస్త్రములందు మరేశిక్షయు విధింపబడలేదు. కావున ప్రభువువారి శిక్ష నంగీకరించెదరని నమ్మెదను.

అగ్బరు:—[సావధానముగా, తనలో] మరణదండనకంటె రాజద్రోహికి మరేశిక్షయును లేదట!...కటిక కరవాల ధార...కరుణారహిత అగ్నిజ్వాలలు మరింత హృదయభేదక దండనలు. ఉరిశిక్షయే కొంత వరకు మేలు.

[ప్రకాశముగా] సభికులారా! మీయపార రాజభక్తికి సంతసించితిని. అట్లేయగుగాక.

[తోడరుమాలు శిక్షాపత్రమునిచ్చును. అగ్బరు దానిపై సంతకముచేయును.]

మానసింగు:—ముర్రాజ్! ద్రోహీ!! నీవేల ఈ కార్యమునకై తలబడితివి. ఈనీకృత్యము...ఇతరుల ప్రేరేపణాఫలితమా??.....కాక స్వకీయోన్మాధ ఫలి

తమా??? నీ స్నేహితుడు రాజు సుఖముగా నిహ
లోకమును వీడినాడు.

[ముర్తాజు ఉలిక్కిపడి మానసింగును చూచును]

మరినీవేల ఇంకను జీవించియున్నావు? దుర్మార్గుడా! మహాత్ముడగు ఫజిలు నేల చంపించితివి? అతడు నీకే యపకృతి నొనర్చినాడు!!!!

[ముర్తాజు ఆశ్చర్యముతో తెల్లపోవును]

కానిమ్ము. జరిగిన దానికిప్పుడు పశ్చాత్తాపపడి లాభములేదు. నీ మరణశిక్షకై వేచియుండుము.

ముర్తాజు: [ఆకాశమువైపు చూచుచు, బిగ్గరగా] రాజా! ఎంతటి ద్రోహివైతివి? పవిత్రుడైన అబ్దుల్ ఫజిలును చంపితివా? ఆహా! ఈ విషయమై నాతో ముందేల చెప్పవైతివి? స్నేహపాత్రుడవని తలంచితినిగాని, యింతటి ద్రోహివని కలనైన తలంపనైతిని గదా!!

రాజా! ఛీ. నీపేరెత్తరాదు. ఎంతటి అవివేకివైతివి? నీవెంతటి స్వార్ధపరుడవు. పవిత్రమని తలంచినకార్యము, నీ వలన......అపవిత్రమైనది!!! మాతృదేశభక్తితో దలపెట్టినకార్యము, నీవలన......నిందలకాస్పదమైనది!!!! ఇస్లాము మతమందలి భక్తిచే దలపెట్టినకార్యము,నీవలన...

పాపపంకిలమైనది ! ! ! ! ! కానిమ్ము. రాజా !
నీకు తగిన శిక్షను నీవే విధించికొంటివి.

తోడరుమాలు:- [నేరస్థునితో, మెల్లగా] నిర్భాగ్యుడా ! నీకింక ముక్తిలేదు. న్యాయశాస్త్రమును దిక్కరించుట కేరితరమును గాదు. భగవంతుని ప్రార్థించుము. ఇక నీ ప్రపంచమును నీవు చాలకాలముచూడలేవు. ఇకనైనను దయామయుడగు 'అల్లా' పవిత్రనామ మును స్మరించుము. ఇహలోకమున గాకపోయిన, పరకలోకముననైనను నీకు సుఖము లభించును.

[నేరస్థుడు మాటాడక తలవంచియుండును.]

[ప్రవేశము : ఒకభటుడు]

[చక్రవర్తికి ముమ్మారు సలాముచేసి]
ప్రభో ! ద్వారముకడ యువకుడొకడు తమ దర్శ నార్థమై వేచియున్నాడు.

చక్రవర్తి:—ఎవడతడు ? ఏమికావలెననుచున్నాడు??

భటుడు:—ప్రభో ! దేవరవారి సముఖమున దక్క ఆతడా విషయమును జెప్ప నిరాకరించుచున్నాడు.

[సభికులు ఆశ్చర్యముతో అగ్బరుదిక్కు చూతురు.]

అగ్బరు:—[సాలోచనగా] సేవకులారా ! నేరస్థునావలకు గొనిపొండు.

[నేరస్థుడావలకు గొంపోవబడును.]

[భటునితో] ఆతనిని ప్రవేశపెట్టుము.

[భటుడు నిష్క్రమించి, తిరిగి యువకునితో ప్రవేశించును.]

అగ్బరు:— [యువకునిచూడగనే చక్రవర్తి సంభ్రమాశ్చర్యములతో ప్రక్క ఆసనమును చూపుచు]

స్నేహితుడా! రమ్ము. ఇట్లు వచ్చి కూర్చుండుము. [సభికులదిక్కు] సభికులారా! ఇతడే నా ప్రాణ దాత!! మున్రాజు ఖడ్గము బారినుండి నన్ను దప్పించి తానే గురియైన కరుణామయుడు!!! ... స్వార్థత్యాగి!!!!

యువకుడు:—[అచ్చటనుండి కదలక] ప్రభో! ఆ విషయమును మరిచిపొండు. నాకొకవరము దయ చేయవలెను. ఇది ప్రతిఫలము కోరదగిన కార్యముకాదు. కాని అనివార్యమగుటవలన నా కడసారికోరికగా నేనొకవరమును కోరుచున్నాను. దేవరవారను గ్రహింతురు గాక!

చక్రవర్తి:- [సంతోషముతో] స్నేహితుడా! నీకేమి కావలెను. నీవేమి యడిగినను ఇచ్చుటకు సంసిద్ధుడనే. అధికారమా? ... ... అతులసంపదలా?? ఏమి కావలెను?

యువకుడు:—కాదు, ప్రభో! కాదు. నాకధికారమక్కరలేదు. అధికసంపదలక్కరలేదు. [కొంచెమాలోచించి] ఒక్క

క్షమాభిక్ష! ఒక్క క్షమాబిక్ష!!... మాత్రమే. అదియే నాకు ముఖ్యావసరము. ఏకైకవాంఛితము.

అగ్బరు– [తృళ్లిపడి, ఆశ్చర్యముతో] ఒక్క క్షమాభిక్షయా...

[సభికులదిక్కు ఆశ్చర్యముతో పరికించును.]

యువకుడు:–అవును. క్షమాభిక్షయే!!! ఏకరినాత్కుడు సార్వభౌముని ప్రాణాపహరణమునకై ప్రయత్నించెనో అతని క్షమార్పణ!!! ఆతని విడుదల!!!! అదియే నా యేకైక వాంఛితము.

అగ్బరు:–[తనలో] నేరస్థుని రక్షించుటకు తగిన యవకాశము లభించినది.

[ప్రకాశముగా, కొంచెము కోపమును నటించుచు] యువకుడా! నీ వెవ్వరి ప్రాణముల నర్థించుచుంటివో తెలిసికొంటివా? అతడు దేశద్రోహి!!....రాజద్రోహి!!!

యువకుడు:– నేను మిమ్ములను రక్షించితిని. మీరు మీ ప్రాణదాత కోరికను చెల్లింపరా?

అగ్బరు:– యువకుడా! కోరరాని కోరికను కోరితివి. నేను చక్రవర్తినే. కాని నేరస్థుడనైనచో నేనును శిక్షింపబడవలసినదే! అదిరాజధర్మము!!...... న్యాయమార్గము!!!

యువకుడు:—ప్రభూ ! మిమ్ముల రక్షింపదలచి నేను గాయ పడితిని. దాని ఫలితముగ నేను మరణింప బోవు చుంటిని. దేవరవారు గ్రహింపవలెనని నామనవి.

అక్బరు:— ప్రపంచవిఖ్యాత వైద్యులచే నీకు చికిత్స చేయిం చెదను. యువకుడా! వ్యర్థముగా భయపడకుము. రాజద్రోహివైకై వాపోవకుము.

యువకుడు:— ప్రభువువారు పొరబడుచున్నారు. మురాజు ఈ విశాల ప్రపంచమునెదుటనే రాజద్రోహి. కాని ప్రభూ! నిజముగ ద్రోహి రాజు! చక్రవర్తిపై కత్తిగట్టి... మహాత్ముడగు అబ్దుల్ ఫజిలును చంపిన పాపాత్ముడు రాజు!! మురాజును....మతమను పేరిట, అవమాన ప్రతిక్రియ పేరిట, అతని నుప్పొం గించి... పవిత్రమై, రాజసేవాపరతంత్రమై, విజ్ఞాన దాయకమై యొప్పు మురాజు మనస్సును చెడు ప్రేరేపణలచే మారుత్రోవ ద్రొక్కించిన దురాత్మ ర్గుడు రాజు !!!!! ప్రభో ! మీ హృదయములో ఈ రాజసేవకునికి తావే లేదా ? రాజప్రాణరక్ష ణార్థమై నేను నా ప్రాణముల గోల్పోవనుంటిని. ఈ విశాల ప్రపంచమున నాకు చికిత్సచేయగల వారెవ్వరును లేరు. ఆ నేరస్థుడు.....ఏ కరవాల

మును సార్వభౌమ ప్రాణాపహరణార్థమై వినియోగించెనో, అదివిషపు కత్తి !!

[కొంచెము ఆగి, కష్టముతో ఊపిరిపీల్చుచు]

ప్రభో! గాయము నిరపాయకరమే!!!! కాని ప్రయోగించిన విషము మాత్రము అమితాపాయకరము !!!!

[సభికులలో కలవరము బయలుదేరును]

మానసింగు:—పాపము! అమాయకుడు కోరిన కోరికను వ్యర్థపుచ్చరాదు. చక్రవర్తి, తన ప్రాణదాత అవసానదశయందు కోరిన కోర్కెను దీర్చుట యుక్తము.

ఆస్థానోద్యోగి:—రాజద్రోహియైన నేమి? ప్రాణదాత కోరికను త్రోసిపుచ్చరాదు.

తోడరుమాలు:—[షేకుతో] ఆర్యా! యువకుని విచారము నా హృదయమును కరిగించుచున్నది. ప్రభువు నేరస్థుని విడిచిపుచ్చుట ఉత్తమమేమో !!!!

అగ్బరు:—[తనలో] ఇప్పటికి నాకోరిక నెరవేరినది. షేకు ఫజిలు యేమి చెప్పునో !!!!

షేకుఫజిలు:—మిత్రమా! యువకుని దుఃఖము నాహృదయమునుగూడ భేధించుచున్నది. ప్రాణదాత

కోరిన కోరికను చెల్లింపవలసినదే. ప్రభువు ఏమని సెలవిచ్చునో!!!!

అక్బరు:—[సంతోషముతో] స్నేహితుడా! నీకోరిక నెరవేర్ప బడినది. నా ప్రాణదాత కోరిక నెరవేర్చి నందులకు సంతసించుచున్నాను. [సేవకులతో] నేరస్థుని సభలో ప్రవేశపెట్టుడు.

[నేరస్థుడు సభలో ప్రవేశపెట్టబడును]

అక్బరు:—నిర్భాగ్యుడా! నీ నేరము క్షమింపబడినది. నీకు విడుదలయైనది.

ముర్తాజా:—[తలపైకెత్తి] అల్లా మహిమాన్వితుడు! ... చక్రవర్తి కరుణామయుడు!! ... ...

అక్బరు:—హామ్మ. నీ విడుదలకు కారణము... ... నా ప్రాణదాత! అతడడుగో ... అతనికి నీ వందన శతముల నర్పింపుము.

ముర్తాజా:—[యువకుని దిక్కై]ఎవరు? నా ప్రాణదాతయా!!!
ఆశ్చర్యము [మెల్లగా] నేను కృతజ్ఞుడను !!!!

యువకుడు:—[దుఃఖముతో, బిగ్గరగా] 'బాబా'!!

ముర్తాజా:—[ఆశ్చర్య సంభ్రమములతో] ఎవరు? నా ముద్దుల కుమారి...రషీదా !!! ...నిజమే ???

[ఇరువురును కౌగలించుకొందురు. కౌగలి విడిశడగా రషీదా క్రిందపడి చనిపోవును]

మర్జాజు:—[కుమార్తె వైపుచూచుచు] అయ్యో! కుమారీ! మరణించితివా ? ? ఈలోకములో నీయధము డికేల జీవింపవలెను. తల్లిపోయినదాదిగా నెవ తెను ప్రాణసమానురాలిగ పెంచితనో, అట్టి నా ప్రియకుమారి... నాముద్దుల రషీదా, నాకన్నుల యెదుటనే మరణించినది. !!!!

అయ్యో! కుమారీ! నవయువ్వన విలాసినివి... పూర్తిగా పదునెనిమిదేండ్లయినను నిండలేదే !! అట్టి నీకా ఇట్టి అకాలమరణము. స్వార్థత్యాగినీ! రషీదా!! నీవుపోయినపిమ్మట నాకీలోకముతో నేమిబని యున్నది. నేనును వచ్చుచున్నాను.

[ఆకాశమువైపు చూచుచు] కుమారీ! రషీదా! ... అదిగో తల్లీ! నీవు పిలచుచున్నావా ? నీవు దేవకాంతవా! కాక మనుష్యకాంతవా? నా కన్నులు మిరుమిట్లు గొల్పుచున్నవే!!! ...నీ సమీపమున కీ యధముడు రాదగునా ? ? అయ్యో! కుమారీ! నీవు దుఃఖించుచున్నావా? ఎంతటి పిచ్చితల్లివమ్మా! నీవు!! నీవులేని యీ తుచ్ఛ ప్రపంచము నాకెందులకు ? ఇదిగో!

నీదగ్గరకే వచ్చుచున్నాను. రషీదా! .. రషీదా !!...

[పాడుచుకొని చనిపోవును]

[అగ్బరు-సభికులు ఆశ్చర్యముతో చూతురు]

# తృ తీ యాం క ము

## పంచమ రంగము

సలీము అంతఃపురము

[ప్రవేశము : సలీము సంతోషముతో]

ఆహా! ఇప్పటికి నా కోరిక లీడేరినవి. నా చిరకాంక్షితము సఫలీకృతమైనది. అబ్దుల్ ఫజిలు! యువరాజుయొక్క మహిమ నీ కిదివరకు తెలియ లేదు. నేటికి తగిన ప్రతిఫలము ననుభవించితివి. చక్రవర్తి చెవి కిల్లు కట్టుకుపోరితివి. కాని పాపము నీ యుద్దేశము సఫలీకృతము గాకమునుపే నివీ లోకమును వీడిపోతివి. త్రాగుబోతు ననియు... సింహాసనానర్హుడననియు తలచితివి. పాపము! క్షణములో ప్రకృతియే మారిపోయినది. పాపము

నకు తగిన ప్రతిఫలమైనది. నీకింతటి యాకస్మిక మృతి కలనైన కలుగునని తలంచియుండవు. ఎంతటి అమాయకత్వము!!! ...... ఎంతటి మదాంధత్వము !!!!... తగిన ప్రతిఫలమేనా? సంతోషము... ...సంతోషము !!...

[గ్లాసులో సారాయి ముంచి త్రాగును]

[ ప్రవేశము—కుమారసేనుడు ]

కుమార్:—యువరాజా !

సలీము:—ఎవరువారు ?

[మెల్లిగ కుమారసేనుని వద్దకువచ్చి మొగములో మొగముంచిచూచును]

కుమార్:—యువరాజా ! !

సలీము:—[చిరునవ్వుతో] రషీదా ప్రణయాధిదేవత ! ... కుమారసేనుడా ?

కుమార్:—తుచ్ఛుడా! నీకా పేరు నుచ్చరించు నర్హతలేదు. తండ్రి మరణమున కనుమతించిన కఠినుడవు !..... పవిత్రుడైన ఫజిలు మరణమునకు కారణభూతుడవు !!... ...నా తండ్రిని ఘూతుకకృత్యమునకు ప్రోత్సహించిన అవినీతిపరుడవు!!!......ఛీ. అట్టి నీవా? పవిత్ర రషీదా నామోచ్చారణ మొనరించుట !!...

సలీము:—[గంభీరముగా] కుమార్ సేన్! నీవు యువరాజు యెదుట......మాట్లాడునది!!!

కుమార్:—ఛీ. పలుగాకీ! నీ యెదుటనే మాట్లాడునది. నాతండ్రి నీ ఘాతుకకృత్యమునకు ప్రోత్సాహపరచినది నీవు గాదా??

సలీము:—[గంభీరముగా] అవును... నేనే!!!!...

కుమార్:—మూఢుడా! పవిత్రుడైన ఫజిలు నీకేయపకృతి యొనర్చినాడు?

సలీము:—అవి... రాజకీయరహస్యములు!!!! ...వెల్లడింపబడవు!!!!...

కుమార్:—ఛీ. అవినీతిపరుడవు. నీతో సంభాషించుట నాదే తప్పు. యువరాజాహంకృతిని చూపుచుంటివి. అటులైన తండ్రి దుర్ప్రవర్తనకు కారణభూతుడవైన నీకు తగుబుద్ధి గరపుటకై యే వచ్చితిని. కాచుకొనుము.

[కత్తినొరనుండి లాగును]

సలీము:—[తేరిపారజూచి] కుమార్! ఏమి! నాతో యుద్ధమొనర్చెదనా యేమి?

కుమార్:—అగును! నాతండ్రి మరణమునకు ఆదికారణము నీవు. అట్టి నీకు తగిన ప్రతిక్రియ యొనర్ప నామది

వేగిరించుచున్నది. ఆలసించెదవేల? రమ్ము. కర వాలమును గైకొనుము. పవిత్ర రాజపుత్రవంశీ యుడనైన నేను నిరాయుధునితో పోరాడజాలను.

సలీము:—[కరవాలమును గైకొని]అట్లైన రమ్ము. నేడు నీవో, నేనో జీవితముపై నాస వదలుకొనవలసియున్నది.

[ఇరువురును యుద్ధము చేతురు. సలీము క్రిందపడును]

కుమార్:—[క్రోధముతో సలీమును జూచుచు] పాపీ! నీకు తగిన ప్రతిక్రియ మరణదండనయే కాని నీయట్టి నీచుని... కుటిలుని... త్రాగుబోతును... చంపి పవిత్రమైన నాహస్తమును కలుషిత మొనర్ప జాలను. కానిమ్ము. పూజ్యుడైన అగ్బరు సార్వ భౌముని పేర నీకు ప్రాణదాన మొసగుచున్నాను.

[కరవాలము నాతని ముందువైచి] ఏలనీవీ తరవాతితో ప్రాణముల వీడవు. దుర్మార్గుడా! ప్రాణములపై నంత తీపిగలవాడవు పరులవిషయమున గూడ నట్లేల యోచింపవు? కానిమ్ము. నీకు దగిన ప్రతి క్రియ దైవమే యొనర్పగలడు.

[కుమారసేను వెడలుటకు వెనుదిరుగుట. అగ్బరు సార్వ భౌముని ప్రవేశమునకు క్షణకాలము వ్యవధిలేదు.]

అగ్బరు:—కుమారసేన్! మీ సంభాషణల నాలకించితిని. నీ జనకుదును... మిత్రహంతకుదును అగు రాజు

హత్యకు కారణభూతుడు గాడని వెల్లడియైనది. నేటికైనను ఈ హత్యకు మూలకారణ మెవ్వరో తెలిసిపోయినది.

[సలీమునుజూచి] సలీం! ఏల నీకీ దుర్బుద్ధి వొడమినది. ఏల నీకింతటి యారాటము. నీరాజ్యకాంక్షకు మేరలేదా? కాదేని ఇదిగో నీయెదుటనే యున్నాను. రమ్ము. నన్ను క్రమందించుము. ఇదియేకదా నీకు కావలసినది. నీకోరిక తీర్చుకొనుము. తండ్రిమరణముతో నీవు సింహాసనాసీనుడవయ్యెదవు ......... ఏల నాలసించెదవు. పూజ్యుల నేల హత్యగావించెదవు !!!! నీ తండ్రినే హత్యగావించి యభీష్టసిద్ధినందుము. ఈ ముదుసలి కట్టెతో నీకిక బనియేమున్నది.

సలీము:— [దుఃఖముతో] సార్వభౌమా! క్షమింపుము. కాదేని నీ యిచ్ఛవచ్చినట్లు శిక్షింపుము. ఈ హత్యల కన్నింటికిని కారణము నేనే!!! రాజును ప్రోత్సహించినది నేనే!!! నీ విశాల హృదయములో ఈ దీనునకు తావుగలదేని ప్రసాదింపుము. లేదేని ఈ దురదృష్టవంతునకు మరణమే శ్రేయస్కరము.

[చక్రవర్తి పాదములపైబడును]

అక్బరు:—నిర్భాగ్యుడా! లెమ్ము. క్షమించితిని లెమ్ము. ఏల నీకీవేగిరపాటు. భావిమొగలాయి సార్వభౌముడవైన నీకిది తగునా!!! పొమ్ము. వెడలి పొమ్ము. నీయెదుట నొక క్షణమైనను నుండజాలను...... వెడలిపొమ్ము.

సలీము:—[కుమారసేనుతో] కుమార్! క్షమింపుము. నీ విశాలహృదయములో నీపాపికి పీసమంతయైన తావులేదా?

కుమార్:—యువరాజా! నీపాపమునకు తగిన పశ్చాత్తాపమును గంటివి. నీకిదియే చాలునుపొమ్ము.

[సలీము తలవంచుకొని వెడలిపోవును.

అక్బరు:—కుమార్! నీ హృదయము పవిత్రమైనది. నీవు అబ్జుల్ ఫజిలు స్థానము నాక్రమించుట కర్హుడవు. నేటినుండియు ఈ విశాలసామ్రాజ్యమునకు నిన్ను ప్రధానిగ నియమించుచున్నాను.

కుమార్:—కాదు. సార్వభౌమా! కాదు. ఈ దీనుడు రాజసేవకు నోచుకొని యుండలేదు. ఏ నాడు రషీదా ఈ పవిత్ర భూమినుండి అంతరించినదో ఆ నాటితోనే ఈ కుమారసేనుడు గూడ తిరోహితుడైనాడు. అతని భౌతికశరీరము మాత్రమే ఈభూమిపై

నింకను నిలచియున్నది. పవిత్రమైన రషీదా ఆత్మతో అతని ఆత్మ కలిసికొని యెన్నడో పెనవేసికొని పోయినది. సార్వభౌమా! రషీదాగుణముల వర్ణింప నేనెంతవాడను!!......ఆమె గులాబుల పొదరిల్లు! కాని...అది కంటకావృతము కాదు!!! ఆమె సంపెంగలవాటి!! కాని......దాని వెనుక కాలసర్పములు ప్రాకులాడలేదు!!!! ఆమె మల్లె పూవులపందిరి!!! కాని......దాని సువాసనల యందు మృత్యుదేవత మందహాసము లేదు!!!!! అట్టి నా రషీదాను విడిచి నే మన గలనా! సార్వభౌమా! క్షమియింపుము. వచ్చిన కార్యము నెరవేరినది. ఏ యుద్దేశముతో యువరాజు నొద్దకు వచ్చితినో ఆ యుద్దేశము జయప్రదమయినది. అతడు పశ్చాత్తాపతప్తుడై వెడలినాడు!!.....ఇక సెలవు. నాకీలోకములో నేమియు పనిలేదు. నా ప్రేమమూర్తియూ పోయినది!! ... నా జనకుడా? ... దుర్మార్గుడై, హంతకుడై, తుదకు మరణించి నాడు!!! ... నాకా! పవిత్రమైన రాజసేవ...అలభ్యమైన రాజప్రేమ లభించినది. ఇక నాకు కావలసినదేమున్నది. ఇక సెలవు. రషీదా నాకై వేచియుండును.

(ఆకాశమువైపు చూచుచు)
రషీదా! వచ్చుచుంటిని...నాకై పుష్పవిమా
నము నంపుచుంటివా? ఎంతయుసంతసము......
ఇదిగో వచ్చుచున్నాను. రషీదా!...రషీదా!!...
[పడుచుకుని చనిపోవును]

అగ్బరు:—[విచారముతో] ఆహా! ఒక్కపొరపాటువలన నెన్ని
ఘోరహత్యలు సంప్రాప్తమైనవి. దైవమా! దీని
కంతకును కారణభూతుడను నేనుకాను గదా!!!
[ఆలోచించుచు నిలుచుండును]

అర్ధరాత్రి యైనది!

...

కాకులు కూసినవి!!

...

ఏడుగంటలైనది!!!

సంపూర్ణము

తెనాలి భారతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడిరి. 1939

# రాధ

## (ప్రేమగీతలు)

గ్రంథకర్త : వరఘు శ్రీకృష్ణమూర్తి

యువకహృదయముల నుల్లసిపచేయు ప్రేమగీతలు. కృష్ణుని ప్రేమ—రాధ ఉద్రేకము—అద్భుతము. నవీనము లైన ఈ గీతల కవియేసాటి !

త్వరలో అచ్చుగానున్నది.

రశీదా పుస్తకములు వలయువారు:—

వరఘు వీరభద్రరావు,
ధూళిపూడి.
(Via) రేపల్లె.

అని వ్రాయవలెను.

